# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..







"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్ధికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul



Website: www.freegurukul.org
Mobile App: Free Gurukul
email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul
Help Line / WhatsApp: 904 202 0123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

సాధన గ్రంథ మండలి-98.



# శ్రీ శంకర హృదయము

[బ్రహ్మ సత్యం జగన్మిథ్యా - అను సూక్తి నిర్వచనము.]



రచయిత్రి

శ్రీమతి సంకా సీతామహాలక్ష్మి

తెనాలి.






ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి, తెనాలి.

కాపీరైటు]　　1966　　మూల్యం రు. 1-00

# ఆశీఃపూర్వక ప్రశంస

శ్రీ గాయత్రీ పీఠాధిపతులగు
శ్రీ శ్రీ శ్రీ విద్యాశంకర భారతీస్వామివారు

ప్రపంచములోని శాస్త్రములలోనికెల్ల వేదాంత శాస్త్రము ఉత్కృష్టమైనది. శాస్త్రము లన్నిటికిని రాజుఅనిన్నీ, శాస్త్రములకు శాస్త్రమనిన్నీ వేదాంతశాస్త్రము గౌరవింప బడుచున్నది. 'అధ్యాత్మవిద్యా విద్యానామ్' అనికదా గీతోక్తి.

వేదాంత శాస్త్రములలోకెల్ల, అద్వైతవేదాంతము మూర్ధన్యస్థానము నలంకరించుచున్నది. ఆదిశంకర భగవత్పాదులవారు అప్పటి మనదేశములోనున్న 72 అద్వైతేతర మతములను ఖండించి అద్వైత సిద్ధాంతమునకు ఆధ్యాత్మిక సామ్రాజ్య పట్టాభిషేక మొనరించి యశఃకాయులైరి.

అద్వైత వేదాంతసిద్ధాంతమును బోధించుటకు మూడు ప్రధానమార్గములుగలవు. అవి ఏమనగా,అజాతవాదమార్గము, మాయావాదమార్గము, సుజాతవాదమార్గము. జగత్తు ఎప్పుడు పుట్టనే లేదని అజాతవాతబోధ. జగత్తు మాయయొక్క పరిణామముగా పుట్టినదనిన్ని, బ్రహ్మజ్ఞానము కలుగగా పోవుననిన్నీ, అంతవరకు వ్యావహార సత్యత్వము కలిగినదనిన్ని మాయావాద సిద్ధాంతము. ఈ వాదముప్రకారము మాయ అనునది అనాదియైనను, అంతముకలది అనగా సాంతము. ఈ మాయావాదమే ప్రపంచములో చాలాప్రఖ్యాతిని, ప్రచారమును గాంచినది.

ఇక మూడవ వాదమైన సుజాతవాదమునకు ప్రమాణికమైన ఆధారములున్నను దేశములో అంతగా విస్తరించలేదు. దానిని ఇటీవల అనంతవరం స్వాములవారని ప్రఖ్యాతిగాంచి జీవన్ముక్తులైన మహాపురుషులు ఈ సుజాతవాదమును తమ బోధలలో విశేషముగా ప్రకటన జేసినారు. వారు వ్రాసిన శతాధిక మనన రూప గ్రంథములలో ఈ సుజాతవాదము స్పష్టము చేయబడినది.

మాయావాదము ప్రకారము "బ్రహ్మసత్యం జగన్మిథ్యా" అనునది సిద్ధాంతమైతే, ఈ సుజాదవాదములో "బ్రహ్మసత్యం జగద్బ్రహ్మ" అనునది సిద్ధాంతమై యున్నది. ఈ సిద్ధాంతము ప్రకారము మనకు కనపడు విశ్వమంతియు బ్రహ్మమే. ఈ సిద్ధాంతమును అనంతవరము స్వాములవారి శిష్యులలో అగ్రగణ్యులైన శ్రీ మాలువూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు చక్కగా ప్రచారములోనికి దెచ్చిరి. వారు వ్యాకరణ వేదాంతములలో గొప్పపండితులగుటయేగాక వారికి తెలిసిన విద్యను తమ జీవితములో ఆచరణలోనికి తెచ్చిన మహాపురుషులు. వారు భాగవతమును చెప్పునపుడుగాని, శివరహస్యాది పురాణములను ప్రవచనము చేయునపుడుగాని ఈ సుజాతవాద సిద్ధాంతమును అత్యద్భుత అభినివేశముతోను, చక్కని యుక్తులతోను, శంకర సిద్ధాంత మిదియేయను సంపూర్ణమైన విశ్వాసముతో సుద్ఘోషించెదరు. వారితో నేకీభవించని పండితులుకూడ వారి ప్రవచనమును వినగానే ఆశ్చర్యముతో ముగ్ధులగుదురు. శ్రీ శాస్త్రిగారు ప్రాపంచకవిషయములలో నిర్లిప్తులును పరమశాంతులును అయియుండి జగమునంతను బ్రహ్మముగా జూచి తన్మయత్వము నొందగల మహాపురుషులు. అట్టి ఉత్తమవ్యక్తులు చాలఅరుదు.

ఈ సుజాతవాదప్రకారము ఉన్నదంతయు బ్రహ్మమే. బ్రహ్మము కంటెను వేరుగ, జగత్తుగా కనపడునది ఆ బ్రహ్మము యొక్క స్వాతంత్ర్యశక్తియొక్క వివర్తము. ఈ స్వాతంత్ర్య శక్తి బ్రహ్మకు స్వభావమే. కనుక చిత్ ప్రతిబింబితమైన జగత్తు కూడ బ్రహ్మమే. ప్రపంచము బ్రహ్మముకన్న వేరుగానున్నదని యనుకొనేవారు అట్టి ప్రపంచముయెడ వైరాగ్యదృష్టిని అభ్య సించి బ్రహ్మము లేక భగవానునియందు అనన్యభక్తిని అభ్య సింపవలెను. ఇకను సుజాతసిద్ధాంత ప్రకారమన్ననో, కనబడున దంతయు బ్రహ్మమే యనుభావముతో కనపడు ప్రతివస్తువు యం దును ఆత్మీయమైన ప్రేమదృష్టిని అభ్యసించి సర్వము ఆత్మగానో భగవానునిగానో సాక్షాత్కారము చేసికొనెదరు. వీరిదృష్ట్యా ప్రపంచము వేరుగాలేదు గనుక వీరికి వైరాగ్యబోధ అవసరము లేదు. పూర్వము కబీరుదాసు గోధుమరొట్టెలను కాల్చుకుని నెయ్యి దగ్గరపెట్టుకొని తినవలెనని ప్రయత్నించుచుండగా ఒక కుక్కవచ్చి ఆరొట్టెను నోటకరచుకొని పారిపోయెను దానిని చూచి కబీరుదాసు ఆకుక్కరూపముగా నున్నదికూడ భగవా నుడే అను విశ్వాసము కలవాడుగనుక భగవంతుడే ఆ కుక్క రూపముగా వచ్చినాడని గ్రహించి, స్వామీ ఆరొట్టెలను ఈ నేతితోకూడ తినుడని కేకలువేయుచు పరుగెత్తి దానిని పట్టు కొని ఆరొట్టెలను నేతితో తినిపించినాడని కబీరుదాసు చరిత్ర మనకు తెలియజేయు చున్నది. బాపట్లలో దత్తాత్రేయ మందిర మును, శంకరవిద్యాలయమును స్థాపించిన బ్రహ్మానందతీర్థస్వామి యను జీవన్ముక్తులు అనంతవరం స్వాములవారి గురువరేణ్యులు ఒకసారి తమ శిష్యులతోకూడా యిప్పటికి సుమారు 50 సం॥ల

పూర్వము శ్రీశైలము పోవుచుండగా త్రోవలో పెద్దపులి కూర్చుని యున్నది. దానిని చూచి శిష్యులు భయపడగా భయములేదని వారికి ధైర్యముజెప్పి తాము ఆపెద్దపులి వద్దకు వెళ్లి దాని శిరస్సుమీద చెయ్యిపెట్టి 'మీకు మాకు భేదము లేదు, కాని మావాళ్లు నిన్నుచూచి భయపడుచున్నారు మీరు కొంచెము ప్రక్కగా తొలగండి' అనగానే పెద్దపులి తొలగి పోయినది. భగవానుడే పెద్దపులి ఆకారముగా యున్నాడని వారికి సంపూర్ణమైన విశ్వాసము కనుకను, ఆకనపడునది భగవత్స్వరూపమే అని సాక్షాత్కారము పొందిన మహాపురుషుడు గనుక ఆయనకు ఎటిభయము గలుగలేదు. సర్వము బ్రహ్మము గనో ఆత్మగనో చూచువారికి వేరే రెండవవస్తువు లేదుగనుక దేనిని జూచియు భయపడ నవసరము లేదు. సర్వమును ఆత్మగనే ప్రేమింతురు. కాని ప్రపంచములో చాలామంది ప్రపంచము వేరే సత్యముగా నున్నదని భావించువారగుటచేత, అట్టివారల గురించి ప్రపంచమునందు సత్యత్వబుద్ధి తొలగుటకుగాను, వైరాగ్యబోధ చేయబడినది. ప్రపంచము నంతను బ్రహ్మగా జూచు బ్రహ్మజ్ఞులు చాలఅరుదు. ఈ రెండురకముల బోధలలోను భేదము ఎల్లు పైకికనపడినను, పర్యవసానములో ఉభయులకును ఆత్మసాక్షాత్కారముచే మోక్షమువచ్చును గనుక, ఈ రెంటిని ఫలతః విరుద్ధబోధలుగా పాటించ నవసరము లేదని ప్రాజ్ఞులు గ్రహింప గలరు.

ఇక సుజాతసిద్ధాంత బోధలో ఆరితేరిన శ్రీ మూలుపూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి ఈ గ్రంథమును రచించిన కవయిత్రి శ్రీమతి సంకా సీతామహాలక్ష్మి అనునామె ముఖ్యశిష్యురాలై

వారిబోధలను చక్కగా శ్రవణముచేసి, మననము చేసినది. శ్రీ శాస్త్రిగారికి ఈమె మామగారున్న, భర్తయున్న గువారున్న ముఖ్యశిష్యులగుటయేగాక, అన్యగ్రామము, అన్యకుటుంబముల నుండి వచ్చిన ఈమెయును శిష్యురాలై అగ్రస్థానమును వహించుట చాల ప్రశంసనీయము ఈమె యిదివరలో ఒక గ్రంథము వ్రాసి తెనాలిలో శ్రీ మూల్పూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి తదనంతరము వారిశిష్యులు చేయు గురుజయంతి వుత్సవములో ఆగ్రంథమును నాచేత ఆవిష్కరింప జేసినది. ఇపుడు ఈ గ్రంథమును రచించి దీనికి నా ఆశీస్సులను కోరుటచేత నేనావిషయమై ఈ ప్రశంసను చేయనైనది.

స్త్రీజాతిలో ఈ సీతామహాలక్ష్మివంటి నారీరత్నము చాల అరుదు. జన్మాంతర పుణ్యపుంజ పరిపాకవిశేషముచే ఈమెకు ఈజన్మలో చక్కని భౌతిక దేహవర్చస్సేగాక, చక్కని సంస్కృతభాషాజ్ఞానము, పద్య, గద్య రచనాకౌశలము, క్లిష్టమైన అద్వైత వేదాంత భావములను వెంటనే గ్రహించి ధారణ చేయగల గ్రహణ, ధారణ పటుత్వము, గురువుగారియందు అత్యద్భుతమైన భక్తి, వారుచెప్పిన సిద్ధాంతబోధయందు అచంచలమైన విశ్వాసము, పెద్దలయందు గౌరవము, వినయాది సౌశీల్యము, ఇన్ని సుగుణపుంజముల వర్చస్సుగూడ ఈమెలో విరాజిల్లుచున్నవి. ఈమె రచించిన గ్రంథములో ఈమె ప్రకటించిన వాదమునకు తగిన ప్రమాణములను, యుక్తులను, మహాపురుషుల అనుభవములనుగూడ వ్యక్తము చేసినది. ఈగ్రంథము అద్వైతవేదాంతమును మననము చేయువారికి చాల ఉపయోగకరము. నూతనమార్గములో, గొప్పధైర్యసాహసములతో

యిట్టి గొప్పగ్రంథమును వ్రాయుటలో ఈమెకు యీమెయే సాటి.

ఈమెకు పరమేశ్వరుడు సకలశ్రేయస్సులను కలుగజేయు గాకయని మా నారాయణ స్మరణపూర్వక ఆశీస్సులు !!

విద్యాశంకరభారతీస్వామి
ఆశ్వయుజ పూర్ణిమ. (29- 0-66)



శ్రీ సచ్చిదానందేంద్రసరస్వతీ సద్గురుపాదుకాభ్యాం
నమో నమః

# అభిప్రాయము

శ్లో॥ కార్యకారణ యోరేకాం వ్యక్తిమాదేష్టు ముద్యతా ।
అర్ధనారీతయా స్వార్థం సృష్టం యేన శివోఽస్మ్యహమ్॥

శ్రీమతి లక్ష్మీసౌభాగ్యవతి సంకా సీతామహాలక్ష్మీ విరచించిన "శ్రీ శాంకరహృదయ" మనెడి యీ సారగ్రంథము నామూలాగ్రముగ జదివితిని. 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా' యనెడి బ్రహ్మాద్వైతసారసూక్తియొక్క తాత్పర్యము నీమె స్వగురుముఖమున శ్రవణముచేసియుండిన శ్రీశంకరాద్వైతపు దృష్టిసృష్టిబోధ ననుసరించి ప్రతిపాదించితిననియు, నిదియ శాంకర సిద్ధాంత హృదయమనియును వెలిబుచ్చినది. విషయము, అధికారము, ప్రయోజనము అను మూడంశములు ఇందు నిరూపింపబడినవి.

ఈ బోధ నీమెకు శ్రీ సుబ్రహ్మణ్యగురుపుంగవులు తెలిపి యుండుట, శ్రీవారికిని నాకునుగూడ దేశికులగు బ్రహ్మీభూత పరమహంస శ్రీసచ్చిదానందేంద్రసరస్వతీ సద్గురు శ్రీపాదులవారి ప్రబోధము ననుసరించియే జరిగియుండెను. ఈ శ్రీవారు దృష్టి సృష్టిబోధ నిట్లు తమ అగాధ మననములందు వ్రాయించిరి — చూడుడు.

"ఈ సగుణబ్రహ్మ అంతయు దృశ్య త్రిపుటీరహిత — స్ఫురితిమాత్రమైన సాకారరూపము అని తెలియవలెను. ఈ సమష్టి వ్యష్ట్యాత్మక — అవస్థాత్రయరూప సగుణము విమర్శ — ఆమర్శరూపమగు మనోరూపమని చెప్పినపుడు, ఈ సాకార మైన మనోరూపమునకు 'అసలు' ఉండవలెగద. దీనికి 'అసలు', నిరాకారమే అనుటకు వీలులేదు గద ఈ సగుణమే బాహ్య ప్రపంచమని మనమందరమూ తలంచునపుడు, ఇదియే మానసి కము, ఆంతరము, అని చెప్పుటకు ఈ సాకారరూప సగుణము నకు సాకారముగాను. కేవల ఆంతరముగాను ఉన్న 'అసలును' నిరూపించక తప్పదని తేలుచున్నది. ఈ సాకారరూప — ఆంతర ప్రపంచము ఏమిటా అన్న, ఆత్మపరిణామము గనుక ఆత్మ లోకము గాన, వేద్యరహిత కేవల సన్మాత్ర సత్యవస్తువైనట్టి విత్తిమాత్ర వివర్తము గాన, సాక్షాద్వేదాత్మకము అని చెప్ప దగిన, 'సర్వము సర్వగతము', 'సర్వము సర్వమయము' అని చెప్పదగినట్టి, 'బ్రహ్మైవ లోకః బ్రహ్మలోకః' అను, కార్య బ్రహ్మలోకమునకు అత్యంతవిలక్షణమైన పరబ్రహ్మలోకము సుమా యని చెప్పవలెను. ఈ పరబ్రహ్మలోకమునే 'జీవన్ముక్త బ్రహ్మ' అని చెప్పుటకు సంశయములేదు. 'విశ్వతః పరమా

న్నిత్యం విశ్వ న్నారాయణగ్ం హరిమ్' అను నారాయణ వాక్యము చెప్పు లోకమిదియే. బ్రహ్మదేవుడు తపస్సు చేసిన తరువాత పరబ్రహ్మ ఆయనకు దర్శనమిచ్చిన స్వాత్మలోక మిదియే అర్జునుడు సందర్శించిన విశ్వరూప మిదియే. ఇట్లైనచో, ఈ విశ్వరూపమును సందర్శించి అర్జునుం డెందుకు వెత జెందవలెను అన్న, ఉదరభేదిమతముతో విశ్వరూపము వేరు, తాను వేరు, అనుచు దర్శించినాడు గనుక తాపము నొందెను, అని ఆచార్యవారు భాష్యములో నచటనే నిరూపించియున్నారు. చయనస్వామివారు చెప్పిన విద్యాప్రపంచమేనా ఏమిటి ఇది - అన్న, ఇది విద్యాప్రపంచమే అనుటకు సంశయములేదు గాని, ఈ ప్రపంచము సమష్టి వ్యష్ట్యాత్మక - అవస్థాత్రయరూప సగుణమునకు అభిన్న నిమిత్తోపాదానమగుటచే, 'అసలు' గాన, సర్వాత్మకము, సర్వగతము, అని చెప్పుచుండ, విద్యాప్రపంచము అర్చిరాదిమార్గగమ్యమగు బ్రహ్మాండాద్బహిస్స్థితము అని చయనస్వాములవారు అనినట్లు ఇచట చెప్పబడుటలేదని వైలక్షణ్యము తెలియవలెను. 'ఇహైవ తైర్జిత స్సర్గః' అను శ్లోకప్రతిపాద్య సద్యోముక్తి, కేవల నిరాకార మనోనాశరూప విదేహముక్తియే అనక, శుద్ధసత్త్వమయ సాకార మనోనాశమను పేరుగల, 'సర్వము సర్వాత్మకము' అనునట్టి, సగుణ నిర్గుణైకత్వ జ్ఞానఫలితమైన, ఉత్తమజీవన్ముక్తిప్రద పురుషోత్తమ లోకమని తెలియవలెను. గోపికలు సూర్యోపరాగకాలమందలి భగవద్బోధచే దృష్టఫలముగా పొందిన లోక మిదియే, అని తెలియవలెను. ఈ సాకారమనోనాశము అను ఆత్మపరిణామ లోకమునకును, ఇందుకు అభిన్న నిమిత్తోపాదానమైన నిరాకార

మనోనాశరూపమైన అచలసంవిద్రూప నిర్గుణపరబ్రహ్మకును, సువర్ణ - సువర్ణాభరణ న్యాయమున ముఖ్యైకత్వమునే తెలియవలెను. ఛాందోగ్య అష్టమప్రపాఠకగత - దహరవాక్య భాష్యమందు బ్రహ్మలోకము స్థూలవిషయకమా సూక్ష్మవిషయకమా, అని విచారించి, స్థూల సూక్ష్మైకత్వ ప్రతిపాదక దృష్టి సృష్టి సిద్ధాంతరీత్యా నిరూపించిన అర్థమిదియే.

'ఇదం హి విశ్వం భగవాన్' అనునట్లును, 'అహ మను రభవం సూర్యశ్చ' అనులాగునను, ఈ సర్వాత్మత్వసందర్శనము గలవారికే ఈ త్రైకాలిక జగద్విషయక సంకల్పస్వాతంత్ర్యము ఆవిర్భవించునని ఈ దహరవాక్యభాష్యములో చెప్పబడినది. ఈ యర్థములో వాశిష్ఠ త్రిపురారహస్య భాగవతాదులు ప్రమాణము లగుచున్నవి.

ఈ పురుషోత్తమలోకమునే, సగుణోపాసకులు, 'అర్చిరాది మార్గముద్వారా దూరదేశమునకు వెళ్ళి పొందినా'మని తలంచెదరని తెలియవలెను వాశిష్ఠము, త్రిపురారహస్యమును చెప్పు అర్థమిదియే. జయవిజయాదు లిట్టి భావము గలవారు గనుకనే గద, సాంప్రదాయిక స్థూలసూక్ష్మైకత్వ జ్ఞాననిష్ఠగల అక్షరోపాసకులగు సనకసనందనాదులచే శపింపబడి, జన్మత్రయమందు వైరభావముతో, ఈ సర్వగత సర్వాత్మక వైకుంఠలోకమును పొంది, ముక్తులైనది! ఈ యధ్యారోపసిద్ధాంతమందు ఈ క్రమముక్తిని ఖండించరుగాని, ప్రశంసించరు అని తెలియవలెను. యదపేక్షయా ప్రశంసించరన్న, ఈ ముక్తిస్థానము తానే యని వీరు అధ్యారోపసిద్ధాంతరీత్యా తెలియక, సృష్టి

దృష్టియే సృష్టి అను భావముతో కృపణులై, ఆ వైకుంఠమున కేగిగూడా, ప్రభుపుసోదరులవలె 'భోగమాత్ర సామ్యలింగాచ్చ' అను సావధికభోగైశ్వర్యములనే పొందుచున్నారు గనుక, అని తెలియవలెను. అయితే, ఇది బ్రహ్మజీవసిద్ధాంతమని తమరు చెప్పుచున్నారుగదా? బ్రహ్మయే సర్వత్రా సాధకుడైనపుడు, ఎవరిని ఏవిషయములో నిరసించుట సంభవించును? అని అన్న, ఈ రహస్యము నెఱింగితే, యీ నిరసించుటగూడ లీలామాత్ర మనుట సంభవించును. ఈ యాత్మపరిణామమగు లోకము, ఈ సమష్టి వ్యష్ట్యాత్మక సగుణలోకము అను అపరప్రకృతికి, అభిన్ననిమిత్తోపాదనము, అసలు లోకము, అని చెప్పుటవలన లాభము ఇదియే యని తెలియవలెను. అపుడు ఈ సమష్టి వ్యష్ట్యాత్మక అవస్థాత్రయములోగూడ మనము జాగరూకులమై యుండుట సంభవించును. ఇదివరకు నిద్రితులముగాను, స్వప్న గతులముగాను ఉండుట ''నృషుతవ మాయయా భ్రమమ్'' అనినట్లు స్వాధీనమాయావిలసితమే అని తెలియవలెను. అపుడు ఈ సగుణప్రపంచమంతా 'సమాధి'యగు 'నా భావ'అని మనకు విశదమగును. "చిదంబరేశులము" అపుడు మనమగుదుము. నిత్యమూ, సర్వగతమూ, స్థాణువువలె కూటస్థము, అచలసంవిత్తు అయిన నిరాలంబమనస్సే వాసుదేవుడని భగవంతుడు గీతలో సెలవిచ్చియున్నాడు. ఈ వాసుదేవులము మనమైనచో, మనకు చలనాదులు మానసికములుగాక యదార్థము లెట్లగును? ఈ స్థూలసూక్ష్మాత్మకత్వరీత్యా చరవాసుదేవులము గావలెగాని, కృపణమతాభినివేశముతో మనము గరుడవాహనారాధకుల మైనా మనకోరిక యెన్నటికినీ సిద్ధించదు.'' అని.

ఇంకను దృష్టిసృష్టిభావము నిట్లు శ్రీవారు విశదపరచిరి. చూడుడు—"ఈయాత్మ బహుభవనరూపవ్యక్తులందరు పరబ్రహ్మ యొక్క అనన్యాంశలు గనుక సృష్టి స్థితి లయ స్వాతంత్ర్యము గల బ్రహ్మిష్ఠులగు జ్ఞానులని చెప్పబడుచున్నారు. వీరందరు సముద్రతరంగన్యాయమున స్వాత్మనిస్థితులగుటచే నిత్యముక్తులని చెప్పుటకు సంశయము లేదు. ఈ బ్రహ్మానన్యులగు ప్రత్యగ్వ్యక్తులు ఈ బ్రహ్మాకాశమందు విరాజమానులగు నక్షత్రములు అని చెప్పవచ్చును. ఈ నక్షత్రభూతులై, స్వాత్మనిస్థితులు, స్వానన్యభూతులు అయిన ప్రత్యగాత్మలు సాన్నిధ్యమాత్రమున తమయందు అవ్యక్తాది స్థూలదేహాంత అపంచీకృత పంచీకృత భూత భౌతిక త్రైకాలిక సగుణప్రపంచములను,స్వప్న మనోరథాది ప్రపంచములనువలె ఉన్మేష నిమేషన్యాయమున ఉత్పత్తి స్థితి లయముల నొందింపుచు నిత్యముక్తులయ్యును బంధమోక్షములను క్రమముగా పొందుచున్నట్లుందురు." అని.

అధికారిని గుఱించి యిట్లు వ్రాయించిరి—"బ్రహ్మమే అధికారియైనపుడు అధికారి తారతమ్యాదులు మాయికములు; బ్రహ్మ లీలాప్రవృత్తి కనువుగా నుండును. ఆత్మ యీపాదమందు త్రైగుణ్యాత్మనా వికారము నొందియున్నది. కనుక ముముక్షువులు ఈ త్రైగుణ్య ధర్మములయందు అభినివేశించక త్రిపాద్విభూతిలోకి అర్చిరాది మార్గముద్వారా యేగుట మంచిది. లేదా ఏ యోగభక్త్యాది సాధనములతోనో సర్వగతమగు పరబ్రహ్మయందు చిత్తమును నిరవశేషముగా లయింపజేసికొని, సద్యోముక్తి యను ఆత్యంతిక జన్మరాహిత్యమును పొందుట మంచిది. కాని వీరిలో నెవరును బ్రహ్మజీవవాదము నెడి

దృష్టి సృష్టి శ్రద్ధగలవారు కారు. సాక్షియందే యీ సగుణము అధ్యారోపిత మనెడి స్థూలసూక్ష్మాత్మకత్వశ్రద్ధయే దృష్టి సృష్టి శ్రద్ధ. పరబ్రహ్మయే అవ్యక్తాది - అస్మత్ స్థూలదేహాంత - అపంచీకృత పంచీకృత భూతభౌతికములను ఈక్షణమాత్రమున అధ్యారోపితములనుగా సర్వబుద్ధిసాక్షియగు తనయందు ఆరోపించుకొని వాటిలో తాను అదివరకే అచట నున్నాడుగాన ప్రవేశించినట్లు ప్రవేశించి ఘటోదరస్థితచలద్దీపకళికవలె చల సంవిదాత్మక జీవరూపుడుగా నున్నాడు, అనునదే భూతైర్మహా ద్భిర్య ఇమాః పురో విభుః" అను భాగవత ద్వితీయస్కంధ మందలి శ్లోకార్థము. ఇట్లు తెలసి ఉత్తమజీవన్ముక్తులగుటే ఉత్తమాధికారుల లక్షణము" అని.

ఇక ప్రయోజనవిషయమై శ్రీవారిట్లు వ్రాయించిరి — "అధ్యాసపరిపూర్ణమైన పరబ్రహ్మయొక్క పూర్ణస్వాతంత్ర్య కృత - దృష్టిసృష్టి అను పేరుగల - పరబ్రహ్మకు, బ్రహ్మిష్ఠు లకు ఉత్తమ జీవన్ముక్తిప్రదమైన ఆహార్యాధ్యాసయే గాని, ప్రమాదముగల ప్రమాతయొక్క ఆవరకాధ్యాసము గాదు. ఇది దృష్టిసృష్టినిబట్టి చెప్పబడెడి అధ్యాసము. ఈ ఆహార్యా ధ్యాసమునుబట్టియే జీవులు ఇహపరలోకములను తమ హృదయ మైన చిదాకాశములోనే ఈక్షణమాత్రమున సృష్టి స్థితి లయ ముల నొందించుకొనుచున్నారు. కనుక వీరి దృష్టాదృష్ట గమనాగమనాదులు స్వప్రతిబింబిత దేశకాలాది మూలకము లగుటచే ప్రాతిభాసికములు గాన, ఆత్మరత్యాత్మ క్రీడారూప ములు. శ్రద్ధా భక్తి జ్ఞానములవలన ఈ సిద్ధాంతప్రజ్ఞ గలవారికి మోక్షబెంగ అనవసరము; అనగా సర్వవ్యవహారోచ్ఛేదకమైన

అశరీర ముక్తి బెంగ అక్కఱలేదు. సర్వజీవులు ఈ జీవితముండు వరకును – 'వీరే మా బంధువులు, ఈ దారపుత్రులే దారపుత్రులు, ఈ స్నేహితులే స్నేహితులు, ఈ గృహ దేహ దేశ మతములే మాకు నిజములైనవి' అను అనుబంధముతో మన స్థైర్యముగా వెనుకా ముందూ ఆలోచనలేకుండ యుండి యున్నటే యుందురు గాక! ఇదివరకుగాని, ఇక ముందుగాని, వీరు వీరి స్వస్థితి నుంచి తొలగనే తొలగలేదు, తొలగరు. ఎప్పుడూ వీరు స్వాత్మనిష్ఠితులగు సచ్చిదానందమూర్తులు, అధోక్షజులున్నూ. ఈ మాట మన హృదిస్థితమైనచో సర్వాత్మనా యున్నది మనమే యను ప్రజ్ఞ మనకు స్థితమగునుగదా! అప్పుడు స్వేచ్ఛాపరేచ్ఛాప్రారబ్ధములు అద్వయాకాశస్వరూపులగు మనకు ఆభాసలై, అలంకారములే యగును. అందరి మనోరాజ్యములలోను మనము నిర్విక్షేపముగా కలిసి, ఆచార్య ప్రోక్త జీవన్ముక్త్యానందలహరి అను గ్రంథమునకు లక్ష్యభూతుల మగుట సంభవించును." గనుక ఉత్తమజీవన్ముక్తియే దృష్టిసృష్టి బోధకు ప్రయోజనమైనది. ఇది ద్వైత విశిష్టాద్వైతులు చెప్పునట్లు ఎచటనో సుదూరమైన పరమపదమున అర్చిరాది మార్గప్రాప్యమైన సగుణఫలముగాదు, మరేమన – జీవుడు తన స్వస్వరూపమైన దహరముననే ఉత్క్రాంతి గత్యాగతులు లేకుండా, స్వాత్మవిలాసములతో, "సర్వాత్మత్వ మహావిభూతి సహితం స్యా దీశ్వరత్వం స్వతస్సిద్ధమ్" అనినట్లు – 'ఆత్మరతి రాత్మక్రీడః ఆత్మా రామః' అను విధమున విహరించుటే యగును.

ఇక 'ఆకాశమం దాత్మనిష్ఠ' యనెడి దృష్టిసృష్టి విజ్ఞానానుసారి సమాధినిష్ఠను గుఱించి శ్రీవారు సెలవిచ్చిన ప్రవచన

మును చూడుడు — నిరాలంబ మనస్సు, అచలసంవిత్తు, అను సర్వబుద్ధిసాక్షియగు స్ఫురత్ప్రకాశాత్మక ఆకాశమందు ఆత్మనిష్ఠ కలిగినదాకా, సమష్టివ్యష్ట్యాత్మక - అవస్థాత్రయరూప - విమర్శ ఆమర్శ అను పేళ్లుగల మనస్సే మనము' అను బుద్ధి మనకు నివృత్తముగాదు, పురుషోత్తమత్వబుద్ధి కలుగదు అనుట నిశ్చితార్థము. నిరాలంబమనస్సు అను సర్వసాక్షియందు ఆత్మనిష్ఠ కలుగుతే 'మనస్సు మారు మనస్సు నొందుట' - అని తెలియదగియున్నది. అపుడు సర్వమనస్సులు సాధకుని మనస్సులే యగును. స్థూల సూక్ష్మైకత్వజ్ఞానము పరిపాకము నొందును. త్రిపురారహస్యములో చెప్పబడిన బహుమానసిక రాజయోగుల మగుదుము. సర్వత్రా అదభ్రసౌహార్దము, ఆత్మస్వాతంత్ర్యము ఆవిర్భవించును — అని.

ఇట్లు సద్గురుశ్రీచరణులు దృష్టిసృష్టివేదాంతానుసారము తత్త్వవిజ్ఞానమును, సమాధినిష్ఠను, అధికారిప్రయోజనములను, తమ ఆరూఢప్రవచనములందు బోధించియుండిరి ఈ రచయిత్రి ప్రతిపాదించిన భావములకు ఆకరమైన ఈసద్గురుప్రబోధము నిట్లు మనము గమనించిచూచితిమేని, ఈమె చక్కని బ్రహ్మమేధాతో వ శ్రుతవిజ్ఞానమును ధారణము జేసినదని తేటపడును.

స్వసమాన శీలవ్యసనవంతులగు సాధకులందర కీ రచము సముచితోపకారకము కాగలదు

స్వస్తి శివం భూయాత్,

సద్గురు శరణుడు,
మున్నంగి పున్నయ్యపంతులు
నందివెలుగు.

# మందలిమాట

భారతదేశము వివుతచ్ఛాయాచ్ఛన్నమై - జ్ఞానమను భ్రమతో అజ్ఞానము వంకకు - వెలుగను భ్రాంతితో చీకటి వంకకు - పరువెత్తి పోవుకాలమున సాక్షాత్ శంకరావతారులైన జగద్గురు శంకరాచార్యులు అద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించిరి. దానితో పరమతము లన్నియు సూర్యునిముందు చుక్కలైనవి.

శంకరులు జగతి కనుగ్రహించిన అద్వైతసిద్ధాంత సుధాప్రవాహమునందు సాధారణ జనానీకముకూడ ఓలలాడి తరించుటకు సోపానప్రాయములైన గ్రంథములనేకములు సంస్కృతమునందు, వానిననుసరించి తెనుగునందు వెలువడినవి ఈ సర్వగ్రంథములకు అద్వైత సిద్ధాంత ప్రతిపాదనమే లక్ష్యము. అయినను దేని విశిష్టత దానిది. ఈ శంకర హృదయము కూడ అట్టి గ్రంథములలో నొకటి.

ఈ గ్రంథరచయిత్రి శ్రీమతి సంకా సీతామహాలక్ష్మిగారు. ఈమెకు గురువులు బ్రహ్మశ్రీ మూలుపూరు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. (పరమగురువులు అనంతవరములో నివసించిన స్వాములవారు. ఈ స్వామి యతిరూపముదాల్చిన పరబ్రహ్మము అనదగినవారు.) సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రకాండపండితులు. ఉత్తమసాధకులు, జీవన్ముక్తులు. ఇట్టిదైన ఉత్తమ గురుపరంపర నుండి లభించిన జ్ఞానసారమును హృదయపేటియందు పదిలపరచుకొని భావించి భావించి ఈ రచయిత్రి ఈ గ్రంథమును

రచించినది. గ్రంథము చూచుచో శిష్యునినోట గురువే పలుకు చున్నాడనిపించును. ఈగ్రంథమును గురుపులకే అంకితమిచ్చుట ప్రశంసింప దగినది.

ఇంత చక్కని గ్రంథమును మా మండలి యందు అచ్చొత్తింప ననుమతించినందులకు శ్రీమతి సీతామహాలక్ష్మిగారిని మండలి ఎంతయు అభినందించుచున్నది. ఈమె ఇట్టి గ్రంథముల నింకను రచించి వెలయింపగల సమర్థత కలవారు. భగవానుడు వారి యత్నమునకు చేయూత యొసంగుగాత !

ఇట్లు,

బులుసు సూర్యప్రకాశ శాస్త్రి

వ్యవస్థాపకులు :

సాధన గ్రంథమండలి, తెనాలి.

—♦—

# విజ్ఞాపనము

అద్వైత తత్త్వప్రకాశకులైన సద్గురువులు దివ్యశ్రీ మాలువూరు సుబ్రహ్మణ్యశాస్త్రిలవారు సంప్రదాయసిద్ధముగా సాగించుచుండెడి ప్రబోధసారాంశములు అంబుధివలె నపారములు. అగమ్యమైన యద్వైతతత్త్వ మతిసుగమ్యముగా నుండునట్లు బోధజేయు సుధీవిశాలురగుటచే పండితప్రకాండులు సైతమట్టి సమన్వయార్థముల నంగీకరింపక తప్పకయుండె ననునది ప్రాజ్ఞలోక మెఱింగిన విషయమే. అట్టివారి ప్రబోధాంశముల తత్త్వార్థము. మననాభ్యాసముచే "దూరస్థంచాంతికేచ తత్" అనునట్లు అపరోక్షమై, స్థితప్రజ్ఞాజనకము కాగలదనుట యనుభవజ్ఞులకు సమ్మతము. అయ్యది తత్త్వమననశీలురకే స్వయంవేద్యము. అట్టి శ్రీవారి బోధసారమున "ఏషతూద్దేశతః ప్రోక్తో" యనునట్లు, సంద్రమున తుంపర్లవలె కొన్ని విచారణాంశముల నొక చిన్న పుస్తకరూపమున "అద్వైత బ్రహ్మవిద్యాసారమను" పేరున నతిసామాన్య భాషారీతిలో రచన గూర్చి శిష్యావళి ప్రోద్బలమున శ్రీవారియొక్క ప్రథమ జయంత్యుత్సవ సందర్భములో నాచే చదువరుల కందింప బడినది. కాని లోకమున సామాన్యప్రబోధముచే తత్త్వజ్ఞాన మొకింత తెలియవచ్చిననూ, అద్వైతానుభూతిని సాధించెడి విషయమున అభ్యాసకులకిట్లు సందేహములు కలుగును. అద్వైతము అనుభూతియె గదా? చెప్పుటెట్లు? చెప్పినచో ద్వైతమేయగుగాని అద్వైతము కానేరదు గదా! యనునిట్టి యబోధవాక్యములు వినవచ్చు చున్నవిగదా! ఇట్టి శంకలను సమన్వయింపదగు ప్రమాణయుక్తిసహిత పరిశీలనమంతయు శ్రీవారు ప్రవచనములలో శ్రోతల కందించియే యుండిరి. కాని, శ్రోతల ప్రజ్ఞా

మాంద్యముచే శ్రీవారి బోధసూక్తులు సరియైన గ్రహణమునకు రానేరవు. అట్టితరి, శ్రీవారి పూర్ణబోధసారమును, శ్రోతల యొక్క సందేహములను తొలగించి, నిర్మలవిజ్ఞానము గలుగు నట్లు వెల్లడించిన బాగుండును గదా! యని, నామానసము తరచుగా సందడించు చుండెడిది.

ఇంతటిలో భగవత్ప్రేరితమా యన్నట్లు, ఈ యద్వైత తత్త్వరహస్య సారాంశమును, 'బ్రహ్మ సత్యం జగన్మిథ్య' యనెడి సూక్తిసమన్వయముచే, దృష్టిసృష్టిబోధ ననుసరించి, 'శ్రీశంకర హృదయ' మను పేరున, ఈ చిన్న గ్రంథరూపములో శ్రీవాగ్దేవి ప్రసాదముచే గావించుటయైనది. మరియు నద్దానిని శ్రీ గురుదేవు లకే సమర్పణము జేసికొనుటకు, శ్రీవారి తృతీయజయంతీ సందర్భముననే నవకాశము కలిగినది.

పాండిత్యలోపముచే ప్రజ్ఞాశాలురకు హృదయంగమైన విధముగా నిరూపణము జరిగియుండకపోయినను, విజ్ఞాను లిందలి భావార్థమునే గ్రహించి, యాశీఃప్రసారముల నొసంగ విజ్ఞాపనము.

మరియు భక్తి జ్ఞాన ప్రబోధకములగు ఉత్తమ ఆధ్యాత్మిక గ్రంథములు ప్రకటించి ప్రచారముచేయుచున్న సాధన గ్రంథమండలి సంపాదకులు, తమ మండలిలో ఈ గ్రంథమును ప్రకటించుటకు ఆమోదించినందులకు వారికి నా కృతజ్ఞతాభి పూర్వక అభివందనములు తెలుపుకొనుచున్నాను.

ఇట్లు,
రచయిత్రి.

# అవతారిక

## తత్త్వప్రక్రియాభావము

"బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" యనెడు శాంకరాద్వైత సిద్ధాంతసారసూక్తికి "బ్రహ్మ సత్యం జగద్బ్రహ్మ" యనెడి గూడాభిసంధి ప్రదర్శింప బడుచున్నది. ఇట్టి విజ్ఞానాంశ మిచట దృష్టి సృష్టి ప్రక్రియ ననుసరించి సాగించుటయైనది. దృష్టి సృష్టియన, బ్రహ్మము తన స్వాభావమైన అఘటితఘటనాశక్తిచే అనగా, (తనకభిన్నముగు) ఆత్మ మాయచే నీ దేశ కాల కలనా వైచిత్ర జగద్రూపమున స్వయంవివర్తమయ్యెననెడి భావము. ఇందుకు భిన్నముగా సృష్టి దృష్టి యనుచు మరొక వేదాంత ప్రక్రియ గలదు. దీనినిబట్టి ప్రపంచము జీవభ్రాంతి ననుసరించి (జీవుని కర్మానుసారముగ) ఈశ్వరసృష్టమైనది - అని నిర్ణయింప బడినది. ఇందు సృష్టికర్త జీవ భిన్నేశ్వరుడుగా భావింపబడును. మొదటి ప్రక్రియ యందు జీవాఽభిన్నేశ్వరుడే స్రష్టగా తెలియబడును. ముందుగా ప్రజ్ఞా వికాసమునకై సృష్టి దృష్టి ననుసరించిన మిథ్యాత్వము నిరూపింపబడి పిమ్మటదీనిని నిరసింప దృష్టి సృష్టి విధానముచే మిథ్యాత్వ హృదయము నిరూపించ బడినది.

ఇక నీరచనము నందలి విషయ విభాగ మేమన, విషయము, అధికారి, ప్రయోజనము లనెడి మూడు ముఖ్యాంశ

ములు నిరూపింపబడినవి. విషయవిచారమున ప్రమేయ, సాధన విచారములనెడి రెండు ప్రకరణములు గాను, అందు సాధన విచారమున జ్ఞాననిష్ఠ, కర్మనిష్ఠ యని రెండు అవాంతరాంశ ములుగాను వివేచించుట జరిగినది. సహృదయులగు జిజ్ఞాసు సోదర, సోదరీ వ్యక్తు లిందలి ప్రయోజనమును గని, యాశీర్వ దింప విజ్ఞప్తి యే యాశయము.

ఇట్లు,

ర చ యి త్రి.



# మంగళాచరణము

## శ్రీ గణేశస్తుతి

ఆ. శ్రీగణేశుని, గజముఖున్, శివునితనయు
విఘ్ననాయకు మనమున వినుతిసలిపి
పార్వతీసుతు పదములన్ బాడినట్టి
మనుజకార్యము నిర్విఘ్నమగుచు వెలయు.

## సరస్వతీనుతి

ఆ. వాణి, గాయత్రి, సావిత్రి, వరుస నలరి
నామ రూపములను గూడి నటనమాడు
వారిజనినేత్రి వీణాధరిత్రి గావ
సతత మాయమ సన్నుతుల్ సల్పుచుందు.

ఉ. చక్కని వాక్ప్రసూనముల స్రక్కుగ నల్లెదు వాక్కునిచ్చెఁ తా
మక్కువమెయి నాపయిని మంజులభాషిణి శారదాంబకున్,
దక్కువలేదు లేదెపుడు తల్లిఁదలంచిన యుల్లమందు నా
యక్కఱలెల్లదీరు యశమందగ నేర్తు మహోన్నతంబుగన్.

కం. తల్లీ! నీవో విద్యా
వల్లీ! నేరచన నొకటి వరలించితి నీ
చల్లని యుల్లమునన్, గొను
పల్లవ కరయుగళి బట్టి పద్మదళాక్షీ.

# గురుస్తోత్రము

కం. గురుచరణ సరసిజంబులు
మరువక మది దలచువారి మాంద్యము దొలగున్
అరయగ తెలుకొను న,
ద్గురు చరణమె శరణమనిరి నరులకు జగమున్.

కం. మూలుగ్వారి వంశా! నీ సరి
పోల్పగ గురువెందుగలరు పూజించుటకున్
వేల్పును దెలిపితివే! నిల
దాల్పగ నీ చరణయుగము తారకమయ్యెన్.

ఆ. "బ్రహ్మ సత్యంబ" యని నీవు బలుకుచుంటి,
"జగము మిథ్యయె" యని నీవు చాటుచుంటి,
తిరిగి సర్వము బ్రహ్మగ తెలుపు విధము
విస్మయంబగు వినినట్టి విబుధులకును.

కం. అద్వైతామృతవర్షీ,
యద్వైత సుధారసంబు నందించి యహో!
అద్వయ పదమును జేరితి
వే! ద్వైత ప్రసక్తి లేని విభువని దలపన్.

సీ. నిర్గుణంబైన యా నిజతత్త్వ మరయగన్
ధర నశక్యంబయ్యె తార్కికులకు
అద్వైతుల మటంచు నతిశయోక్తిగ బల్కి
కైవల్యసిద్ధిని గాంచు టెట్లు ?
సగుణంబులోనుండు సారంబు దెలియక
నామరూపంబులే నమ్మియుండి
ద్వైతంబు సత్యసిద్ధాంతమంచని జెప్ప
పరమపదంబును బడయనగునె ?

ఆ. నిత్య ముక్త స్వరూపమగు నీదు రూపు
నిన్ను దెలియగ తెలియనౌ నిజము, నదియె
సగుణ నిర్గుణ సాహిత్య సరణిగూడ
నని, నుడివితిరి సద్గురు లనగ మీరు.

* *
*

# వి ష య ము

సీ. "ధర్మంబు" దెలియని ధార్మికం బదియేల
"సత్యం" బెఱుంగని చదువదేల ?
"తప" మెఱుంగనియట్టి తనువుతో పనియేల
తన్ను దా నెరుగని తపమదేల ?
"దాన" మొసగుట విధానమెరుగకదేల
ధ్యానింపఁ దెలియని జ్ఞానమేల ?
ఆత్మను రక్షించుటది "యహింస" యటంచు
యుక్తిచాలనియట్టి ముక్తియేల ?
"వైరాగ్య" మన నిల నేరాగములు లేక
ఆత్మరాగము కల్మి యనుభవంబు
"సమత" యనంగను సత్యదృష్టియె యని
"అమనస్క" మనగ నాయాత్మ యగుట
"కర్మయోగము" లోని మర్మమెరుగుట యన్న
త్రిపుటి రహితముజేయు తెలివి యనియు
క్రియవిధానముల ప్రక్రియను దెలియక జేయ
సిద్ధిగాదనుచు ప్రసిద్ధియుండె

ఆ. అట్టి సామ్యసారములెల్ల దిట్టబఱచి
తేటతెల్లముజేసిన ధీవిశాలు
సుబ్రమణ్యుల పుణ్యా భూ సురవరులను
ప్రస్తుతింపుదు సద్భక్తి ప్రణతులిడుదు.

ఓమ్

శ్రీ గణేశ శారదా గురుభ్యో నమః
సద్గురు పాదుకాభ్యై నమో నమః

# శ్రీ శంకర హృదయము

["బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" అనెడి బ్రహ్మాద్వైత సూక్తికి "బ్రహ్మ సత్యం జగద్బ్రహ్మ" అనెడి సమన్వయ ప్రదర్శనము.]

## మంగళాచరణము.

శ్లో॥ అజమపి జనియోగం ప్రాపదైశ్వర్యయోగా
దగతిచ గతిమత్తాం ప్రాపదేకం హ్యనేకం
వివిధ విషయగ్రాహి ముగ్ధేక్షణానాం
ప్రణతభయ విహంతృ బ్రహ్మయత్తన్నతోఽస్మి॥

## దృష్టి సృష్టి వేదాంతము

### 1. విషయ నిరూపణము

((A) ప్రమేయ విచారము)

శ్లో॥ అస్తి భాతి ప్రియం నామ రూపం చేత్యంశ పంచకం।
ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతోద్వయమ్॥

ఓంకార స్వరూపమైన బ్రహ్మము మాత్రమే సత్యమైన దనియు, శేషించిన దెల్లను మిథ్యయనియును, ఉపనిషద్వాక్య ములచే విశదీకరింపబడి యున్నది గదా! మరియు నీబ్రహ్మమే

అకార, ఉకార, మకారరూప, ప్రణవమాత్రావాచ్య, సర్వ జగదధిష్ఠాన మనియు చెప్పబడుచున్నది అధిష్ఠానస్వరూప మతో నీబ్రహ్మము నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్తస్వభావమును, నిర్విశేషాఖండాద్వితీయ సచ్చిదానంద స్వరూపమునై యుండి, వివర్తరూపముతో సర్వజ్ఞత్వ,సర్వేశ్వరత్వ,సర్వాంతర్యామిత్వ, సర్వగంధత్వ, సర్వరసత్వాద్యనంత కళ్యాణగుణైకతానుడగు పరమేశ్వరుడుగను, తదుపసేవకుడగు జీవరూపుడుగను, తదువ భోగపదమైన విశ్వరూపుడుగనుగూడ వెలయుచుండు ననియు చెప్పబడు చున్నదిగదా! ఈ త్రివిధ వివర్తమునే త్రిపుటియని పరిభాషించు చున్నారు. ఈ త్రిపుటినే మిథ్యయని చెప్పుచు న్నారు. త్రిపుట్యధిష్ఠానమైన నిర్విశేషబ్రహ్మము మాత్రమే సత్యమని చెప్పుచున్నారు.

మిథ్యాశబ్దార్థమును పండితులు అనిర్వచనీయఖ్యాతి యందురు. దీనినే యనిర్వచనీయాధ్యాస మందురు. మందాంధ కారమున త్రాటిని సర్పమనుకొనునట్లును, శుక్తిని రజితమను కొనునట్లును, మన యంతఃకరణ భ్రాంతివలన బ్రహ్మమును త్రిపుటియని మనము భావించుచుండుటే యీ మిథ్యాధ్యాస మని తత్వజ్ఞులు నిర్వచించు చున్నారు.

అధ్యాసభాష్యమున శ్రీ శంకరు లీ యధ్యాసతత్వమును తెన్నగ నిరూపించిరి. బ్రహ్మమనెడి యధిష్ఠానమున నానా వైచిత్ర్య చిత్రీకృతమైన జగత్తంతయు నధ్యారోపిత మైనది. అధిష్ఠాన మొకతీరున నుండ, నారోపము మరొకతీరున భాసిం చుట సర్వులకును అనుభూతవిషయముగనే యున్నందున, అన్య

త్రాన్య ధర్మావభాసమే సర్వథా మిథ్యాధ్యాస లక్షణమని శ్రీ భగవత్పాదులు తెల్పిరి.

మరియు నిట్టి మిథ్యాపదార్థములయొక్క యునికిని గుఱించి సత్యమనిగాని, యసత్యమనిగాని, సత్యాఽసత్యమని గాని, సత్యాసత్యములు కాకుండుటయనిగాని మనము తెలియుటకు వీలులేదు. ఇట్టి యునికినే యనిర్వచనీయఖ్యాతి యనిరి.

ఈ యనిర్వచనీయాధ్యాసము పలుప్రకారములుగా నిరూపింపబడినది.

(1) అస్తి శబ్దార్థము త్రికాలాబాధ్యమైనది. ఈ జగత్తు యిట్టిది కాదుగదా! "అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత। అవ్యక్త నిధనాన్యేవ తత్ర కా పరిదేవనా" అను గీతా ప్రమాణానుసారము సృష్ట్యాదినిగాని, ప్రళయానంతరమునగాని లేక, మధ్యకాలమునమాత్రము గోచరించునది గావున అస్తిత్వమున కనవకాశమై, ఉనికి లేనిది యనదగుచున్నది. కాన ఉనికి లేనిదగుటచే సత్యము గాదనియు, 'మిథ్య'యే యనియు చెప్పబడినది.

(2) మరియు ఈ జగత్తు జాగ్రత్స్వప్న సుషుప్త్యాద్యవస్థలయందు జూచినను అస్తిత్వము లేక యున్నది. ఎట్లన - జాగ్రత్ప్రపంచదృశ్యము స్వప్నావస్థయందు ఉండుటలేదు. అచ్చట ప్రకృతియే మారిపోవుచున్నది. అచ్చోట నుండు దృక్కు, దృశ్యము మొదలైన సర్వము మనోమయమే (మనస్సే). మరియు సుషుప్తియందు జూచినచో దృశ్యమే లేదు. ఈ

జగత్తు జాగ్రత్తునం దొకకాలమున మాత్రమే దృశ్యమగు చున్నందున స్థిరముగాని దగుటచే 'మిథ్య' యని చెప్పబడినది.

(3) మరియు ఈ జగత్తు జాగ్రత్కాలమునందైననూ, ద్రష్టయొక్క మనోభావ వైచిత్ర్యమునుబట్టి దృశ్యరూపము సైత మన్యాన్యవిధమున గోచరించును. ఉదా॥ గోపికాంగనలు కృష్ణతృష్ణచే, తమాల వృక్షాదులను కృష్ణునిగా భావించిరి. మనోభావము దృశ్యమునం దేకాగ్రము చెందనిచో, పరోక్షమునగల దృశ్యమే బొడగట్టదు. కనుక జగత్తుయొక్క ఉనికి సదా ఒక్కమాదిరిగా నుండుట సంభవింపక మారిపోవుచునే వున్నది. ఇట్టి అనిత్యత్వముచే జగత్తు 'మిథ్య' యని చెప్పబడినది.

(4) ఇంకనూ ఈ జగత్తు అనుక్షణముననూ దీపకళికవలెను, నదీజలమువలెను పరిణామావస్థను పొందుచున్నదనుట నిస్సంశయము. ఇందువలననూ, జగత్తు 'మిథ్య' యని చెప్ప బడినది.

(5) స్వప్నప్రపంచము జాగ్రత్తునందు అదృశ్యమైనట్లు, జాగ్రత్తునందు దర్శింపబడు దృశ్యజగత్తు సర్వము బ్రహ్మజ్ఞానానంతరము లేకయే పోవుచున్నది. గాన ఇందుమూలముననూ, జగత్తు 'మిథ్య' యని చెప్పబడినది.

(6) జగత్కారణ బ్రహ్మ లక్షణములుగా నెన్నబడు చున్న అస్తి భాతి ప్రియ నామ రూపాంశములలో నామ రూపాంశములు రెండును జగద్రూపమై యున్నవి. ఈ నామ రూప జగత్తంతయు దృశ్యరూపమైనదే గాన, "యద్దృశ్యం

తన్నశ్యమ్" అనెడి న్యాయానుసారము నశ్వరమైయున్నది. ఇట్టి నశ్వరమైన దృశ్యమే మిథ్యాభూతమైనదని చెప్పబడును.

ఇట్లనేకవిధముల జగత్తునకు వాస్తవమైన యునికి సంభవింపకపోవుటవలన పండితులు దీనిని పరమార్థసత్యమని యనుటకు వీలులేక, మిథ్యాసత్యమని (వ్యావహారికసత్యమని) యనిరి. ఇది సృష్టిదృష్టిరీత్యా పండితాభిప్రాయము. దీనియెడల కొందరు విమర్శకులు ప్రమాదపడి ఈ మిథ్యాత్వమును మహావైనాశికులనెడి శూన్యవాదుల మిథ్యాత్వమునుగా సంభావించుచున్నారు. ఇది సరికాదు. ఇచటి వైలక్షణ్యమును సృష్టిదృష్టివాది పండితులిట్లు ప్రవచించెదరు — ఏమన, ఈ మిథ్యాసత్యము శూన్యవాదుల శూన్యమెన్నటికిని గానేరదు. శూన్యవాదులు నిరధిష్ఠానభ్రాంతిని చెప్పెదరు. అనగా, ఆకాశమునందే సర్వ జగద్దృశ్యమును మన యంతఃకరణభ్రాంతివలన మనము గాంచుచున్నాము. ఆకాశము శశశృంగమువలె అవస్తువనియు, నిది కేవలము సత్వరహితమైన శూన్యమే యనియు, పృథివ్యాది భూతచతుష్టయమే భావదృశ్యమనియు, ఆకాశము కేవలము అభావమే యనియును శూన్యవాదుల ప్రక్రియ. ఇట్టి శూన్యాధిష్ఠానమున మన మనోభ్రాంతివలన గోచరించునవి గాన, భూతభౌతికములు మిథ్య యనియును వీరి భావము. వేదాంతుల మిథ్య ఇట్టిది కాదుగదా! ఇచటి భ్రాంతి సాధిష్ఠానము. బ్రహ్మాధిష్ఠానకమైన భ్రాంతి వీరిది. కనుక ఈ రెండు మిథ్యలకును మహదంతరమున్నది.

ఇట్లు సృష్టి దృష్టి ప్రక్రియనుబట్టి జగన్మిథ్యాత్వము తెలిసినది. కాని, ఇంతమాత్రమే శ్రీ శంకరాచార్య సిద్ధాంతము

యొక్క భావము కాదు. దృష్టి సృష్టియే శ్రీ ఆచార్యులవారి హృదయమై యున్నదని శ్రీగురుదేవులు సెలవిచ్చిరి. దీనినే నేనిక నీదిగువ నాసంక్షిప్త రచనమున ప్రతిపాదించెను.

## —♦ దృష్టి సృష్టి బోధావతరణము. ♦—

(1) ఉపపత్తి విచారము:- శాంకర దర్శనమున నధ్యాస తత్వమిట్లు బఱగుచున్నది. బ్రహ్మమున జగత్తు స్ఫటిక కుసుమ న్యాయమున ప్రతిభాసించుచున్నది. గాన నఖిలప్రపంచ దృశ్యములును ప్రాతిభాసికములేగాని, వాస్తవములు గావని నిరూపింపబడు చున్నది. "నహి దృష్టాన్తే సర్వసామ్యమ్" అనిన రీత్యా, ఇచట దృష్టాంత దార్ష్టాంతములకు సర్వసామ్యము లేదు. ఎచ్చటెచ్చట ప్రతిభాసము (దృశ్యము) గోచరించునో, నాయది తన యధిష్ఠానమున; నధ్యస్తదృశ్యము మాత్రమే యగునుగాని, తాత్త్వికవస్తువు గాదనియు, నిట్లుకాగా, ప్రతిభాస తదాధారములకు ఆధ్యాసిక (ఆరోపితమైన) సంబంధము మాత్రమే సుమా! యనియును నిరూపించుటకే ప్రోక్తస్ఫటికకుసుమ దృష్టాంత మేర్పడినది.

ఇట్లు దృష్టాంత మేకదేశమైనందున బ్రహ్మ ప్రపంచముల విషయములో మరికొంత సూక్ష్మవిచార మవసరమై యున్నది. ఏమన, బ్రహ్మమునందు ప్రతిభాసించెడి ప్రపంచమునకు మూలమేది? యనెడి యాకాంక్ష సుసమాహితము కావలసి యున్నది. స్ఫటికమున భాసించెడి కుసుమ ప్రతిభాసమునకు మూలము బాహ్యకుసుమము గదా! ఇట్లే బ్రహ్మమున ప్రతిభాసించెడి జగత్తునకు మూలము కాదగిన బాహ్యజగత్తు

కలదా? యని యాలోచింపవలెను గదా? ఇట్లాలోచించితిమేని అఖండాద్వితీయ బ్రహ్మమున స్వేతరము ండుటకే వీలులేదు గాసను, "అపూర్వం అనపర మనంతర మబాహ్యమ్ । కృత్స్నః ప్రజ్ఞాన ఘన ఏవ" అనెడి శ్రుతి ననుసరించి బాహ్యాభ్యంతర భావరహితమై, అంతర్బహిశ్చ తత్సర్వమును నిండి, యావత్తును ప్రజ్ఞానమాత్రమేయై యుండునదే బ్రహ్మముగానను, జగద్దృశ్య ప్రతిభాసమునకు బ్రహ్మాతిరిక్త మూలమంటూ వేరే లేనేలేదు సుమా, యనెడి రహస్యము మనకు స్ఫురించితీరును. ఇందువలన బ్రహ్మమే అఘటిత ఘటనాపటీయసి యగు స్వాధీన మాయా కల్పిత దేశకాల కలనా వైచిత్ర్య చిత్రరూపేణ స్వయంవివర్తమై తానే యీ వివర్తమును గాంచునదియు, ననుభవించునదియు నై యున్నదని మనము గ్రహింపవలసియున్నాము.

ప్రమాణ విచారము:— ఈ సందర్భమున గల శ్రుతి స్మృతి ప్రమాణవచనములు ఉదహరింపబడుచున్నవి.

శ్లో॥ 'తదైక్షత బహుస్యాం ప్రజాయేయ'

శ్లో॥ 'ఆత్మానగ్ స్వయ మకురుత'

శ్లో॥ 'సర్వాణి రూపాణి విచిత్యధీరః ।
నామాని కృత్వాఽభి వదన్య దాస్తే॥'

శ్లో॥ 'పురశ్చక్రే ద్విపదః, పురశ్చక్రే చతుష్పదః ।
పురస్స పక్షీ భూత్వా పురః పురుష ఆవిశత్॥'

శ్లో॥ 'స ఏకధా భవతి - త్రిధా భవతి - అనేకధా భవతి'

శ్లో॥ 'సవై సర్వం మిదం జగత్'

శ్లో॥ 'ఇదం సర్వం యదయమాత్మా'
శ్లో॥ 'ఆత్మైవేదం సర్వమ్'
శ్లో॥ 'పురుష ఏవేదగ్ంం సర్వమ్' - ఇత్యాది శ్రుతులు.

భావము:— 'పెక్కురూపములతో వెలయుదునుగాక యని బ్రహ్మము సంకల్పించెను' 'బ్రహ్మము తననే తాను పెక్కురూపములనుగా చేసికొనెను' 'సర్వ నామరూపములను పరాత్పరుడే ఏర్పరచెను' 'ద్విపాత్తులుగను, చతుష్పాత్తులు గను, పరబ్రహ్మమే రూపొందెను' 'బ్రహ్మము ఒక్కండై యుండియే, మూపురుగను, పెక్కండ్రుగను, ఏర్పడుచున్నాడు' 'పరమేశ్వరుడే నిఖిలజగద్రూపుడుగ వెలసినాడు' 'ఈ దృశ్యమానమగు జగమంతయు ఆత్మేశ్వరుడే' 'ఈ దృశ్యప్రపంచమంతయు ఆత్మయే' 'ఈ జగమంతయు పురుషోత్తముడే'-అని.

శ్లో॥ యస్య యేన యతో యస్య యస్మై యద్య ద్యథా యదా।
స్యాదిదం భగవాన్ సాక్షాత్ ప్రధాన పురుషేశ్వరః॥
అని విష్ణుభాగవత పద్యము.

భావము:— పరమేశ్వరుడే ఈ సమస్తవిశ్వమును కర్తృ, ర్మ, కరణ, సంప్రదాన, అపాదాన, సంబంధ, అధికరణము నిడి సప్తకారకరూపుడై నిర్వహించుచున్నాడు - అని.

శ్లో॥ నిశ్ఛిద్ర దర్పణే భాతి వస్తుగర్భం బృహజ్జగత్।
సచ్చిత్సుఖే తథా నానాజగద్గర్భ మిదం వియత్। అని.
(పంచదశీ)

భావము:— విశాలమైన ప్రపంచము నిబిడమైన అద్దము నం దెట్లు భాసించుచున్నదో, అట్లే సచ్చిదానంద పరబ్రహ్మము నందు నానా జగదాధారమైన భూతాకాశమంతయు భాసించు చున్నది – అని.

శ్లో॥ మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితం ।
మయి సర్వం లయంయాతి తద్బ్రహ్మాఽద్వయ మస్మ్యఽహమ్॥
(అని కైవల్యోపనిషత్తు.)

భావము:— జీవసాక్షి యగు ప్రత్యక్పరమేశ్వరునియందే సకల జగ దుత్పత్తి స్థితి లయములును జరుగుచున్నవి. ఇట్టి అద్వయబ్రహ్మమే ప్రతియొక జీవుడు నైయున్నాడు – అని.

ఇట్లు ద్వైతప్రపంచమంతయు బ్రహ్మముయొక్క స్వస్వాతంత్ర్య విజృంభిత స్వతంత్ర వివర్తమనియే మనము గ్రహింప వలెను. లేనిచో ఈ క్రింది దోసగుల, మాయామిథ్యాత్వవాదమున మన మాపాదింపజేయువారల మగుదుము. ఏమన—

(1) స్ఫటికమున తద్బాహ్యజపాకుసుమమువలె, బ్రహ్మము కంటెను వేరైన జగత్తు తనయందు భాసించుచున్నదని చెప్పినచో, జగత్తు ప్రత్యేక ద్వైతవస్తువనియే యేర్పడునుగదా!

(2) లేక, కుమ్మరి మట్టి చక్రములసహాయమున కుండను చేసినట్లు బ్రహ్మము కేవల నిమిత్తకారణుడై జడోపాదానముచే ఈ జగత్సృష్టిని సలిపినాడన్నచో ఈయన యద్వితీయుడును, నిమిత్తోపాదానోభయకారణుడును గాకపోవును.

(3) లేక, ఈ జగత్తు జీవుని భ్రాంతియే యనిన, జీవుడు జీవుడే, బ్రహ్మము బ్రహ్మమే యగుదురు. జీవుడు బ్రహ్మ మగుటకు వీలు లేదు. జీవుని భ్రాంతి బ్రహ్మ మెట్లెరుంగును? దాని నతడెట్లు నశింపజేయగలడు? భ్రాంతిజ్ఞానము పోయిన గదా జీవుడు ముక్తుడగుట. బ్రహ్మము నెరింగినగదా జీవ భ్రాంతి నివర్తించుట! జీవుడు బ్రహ్మము కానిచో, అతడు బ్రహ్మము నెరుంగ ఏవిధముగనూ సంభవము కాదు. గనుక, ఇట్టి ద్వైతాపత్తిచే బ్రహ్మమున కపూర్ణత్వ మేర్పడును.

(4) లేక, జగత్తు స్వప్రకాశమే యన్నచో దృశ్యత్వము పోవును (గోచరింపబడకుండును) భాసమానమగుచున్నది గాన, దృశ్యము కాదనరాదు

కనుక శ్రీ ఆచార్యుల వారి మిథ్యాత్వ రహస్యమును మనము పైన జూపిన విధమునే గ్రహింపవలసి యున్నది. ఎట్లన — బ్రహ్మ మనగా అద్వయవస్తువు యు, సర్వత్రా ఒకటియే నిండియుండి, సర్వస్వాతంత్ర్యశక్తిని స్వభావముగా గలదియై. ప్రకాశరూపమున పూర్ణమై యుండుననియు తెలుప బడెను. కనుక దృశ్యమగు ఈ జగత్తు సర్వము బ్రహ్మవు భిన్నముగాదు అనగా - బ్రహ్మము పూర్ణమైనందున, జగము అన్యముగానుండ వీలుగాక, సర్వము చిన్మాత్రవిలాసమే యగు నని తెలియవలెను.

ఇందుపై కలిగెడి ఆశంక — ఈ దృశ్యజగమును చూచు వాడు, చూడబడునది, చూపు యనెడి త్రిపుటి తోచుచున్నది గదా! ఇది ఎవరిచేత, ఎట్లు, ఎచట చూడబడుచున్నది? ప్రాపంచకవస్తువులు ఒక ఆవరణలోయున్నట్లు గనబడుచున్నవి.

అట్లే, ఈ జగత్తు మొత్తము ఏ యావరణమున గోచరించు చున్నది? ఇత్యాది శంక వచ్చుచున్నది. దీనికి సమాధానము నారంభ, పరిణామవాదపక్షులగువా రిట్లు చెప్పెదరు. సగుణేశ్వరు నకును, జీవునకును యథాయోగ్యముగ నీ జగత్తు గోచరించు ననియు, సర్వవ్యాపకుడగు సగుణేశ్వరునియందే యీ జగత్తు వ్యాప్యమైయున్నదనియును చెప్పెదరు. కాని, వివర్తవాదులు మాత్రము అద్వితీయ నిర్గుణబ్రహ్మమున నీ జగత్తు మాయా విద్యలచే దర్పణదృశ్యమునవలె ప్రాతిభాసికమై తోచుచున్న దనిరి. ఈ వివర్తభానమునే ఉత్తమాధికారి బోధననుసరించి సద్గురువు లిట్లు సమన్వయించిరి. ఇదియే ప్రస్తుతమైన మన దృష్టిసృష్టి బోధ. బ్రహ్మము నిర్వికల్ప నిరాకార స్వరూప మయ్యు, సత్ చిత్ స్వరూపముగాకూడ నున్నందున, తనదైన సర్వస్వాతంత్ర్యశక్తిచే, అనగా (అఘటితఘటనాపటీయ మహిమచే) ఆత్మమాయచే తనయందు తానే పంచభూతాత్మక చిత్ర విచిత్ర జగముగా దృశ్యమైనదనియు, అన్యము లేనందున ఇచట చూడబడు వస్తువును, చూచువాడును, చూపు అను నీ సర్వమూ తానే అయియుండుననిరి. అనగా తనను తానే, తనయందు తననే, జూచుచున్నాడనుట బ్రహ్మము స్వయము గనే సర్వముగా విజృంభించినాడు అని, 'బహుస్యాం ప్రజాయేయ' అని శ్రుతి ప్రమాణము చెప్పుచనని వింటిమి గదా! "ఇచ్ఛామాత్రా ప్రభోస్సృష్టిః" అను మాట యిదే. బ్రహ్మము యొక్క యిచ్ఛ బ్రహ్మమే యగుగాని, యంతఃకరణముగాదు. ఇదే వివర్తసృష్టి యనగా; ఈ సృష్టి క్రియగాదు. బ్రహ్మము యొక్క చిచ్చమత్కారమే.

ఈ సృష్టి క్రమముగాను, 'యుగపత్'గాను కూడ జరుగును. నిర్వికారబ్రహ్మము అవ్యక్తాద్యస్మాత్ స్థూలదేహాంతముగా (అవ్యక్తము మొదలు స్థూలదేహపర్యంతము) "అవ్యక్తాన్మహాత్ - మహతో౽హంకారః - అహంకారాత్పంచ తన్మాత్రాణి" యనినట్లు తత్తత్కార్య కారణాత్మనా (కార్య కారణాత్మకముగా) అవచ్ఛిన్నవాదులు చెప్పినట్లు, వివర్తభూతుడగు లే క్రమసృష్టి ఇట్లు గాక ఆభాసవాదులు చెప్పినట్లు, బ్రహ్మ మొక్కపెట్టున నీ సకలద్వైతముగ ఇంద్రజాలిక సృష్టివలె వివర్తమై ప్రతిభాసించుచున్నాడనుచో, 'యుగపత్సృష్టి' యని చెప్పబడును. ఉభయత్రా గూడ ఈ సృష్టి ప్రాతిభాసికమే గాని జాతవాదులు భావించునట్లు వాస్తవమైన జని కలది గాదు.

ఇందుపై మరల నొక యాశంక తోచును — ఏమన, సృష్టి నిజముగానిదే యగుచో, సర్వము అర్థక్రియాకారిగా నుండుట యేల? అంతయు కార్యకారణబద్ధముగా గనపడుచున్నది. ఎట్లన - ఆకలి కలిగిన అన్నముతో తీరుచున్నది, దాహము నీటితో తగ్గుచున్నది, జబ్బునకు మందు ఉపశమనకరమగుచున్నది. పుణ్యము చేసిన ఉచ్చజన్మమనియు, పాపము చేసిన నీచజన్మము సంభవించుననియు ఇత్యాదిగా జగత్తు అంతయు పలువిధముల కార్యకారణభావముతో గనపడుచున్నది. అకారణముగా నేదియు దోచుట లేదు. ఇట్లు హేతువ్యవస్థలతో దోచు సృష్టియంతయు అకారణమని చెప్పుచో, లోకమునకు ఒప్పదగినదిగా లేదు. లోకమున కుంటి, గ్రుడ్డి, స్థావర, జంతుజాలాది నీచజన్మలు పాపకృతము లేననియు, ఉత్కృష్ట జన్మములు పుణ్యఫలములనియు వేదప్రమాణము లగపడుచుండ,

సృష్టి అకారణమని చెప్పినచో జెల్లునదిగా లేదనిపించును. ఇట్లు శంక కలుగగా సమాధానము చెప్పబడుచున్నది ఈ శంకకు అవకాశము లేదు. సృష్టి లేనే లేదనిగాని, బ్రహ్మేతర కారణములవల్ల జాతమైనదనిగాని బ్రహ్మవాది యనుట లేదు. మరేమన, బ్రహ్మమే సర్వజగత్తుగా తానొక్కటే ఇంద్రజాలికునివలె వివర్తమై తోచుచున్నది యనిగదా ప్రబోధించునది ! కనుక జగత్తునందలి యవాంతర కార్యకారణము లన్నిటికిని పరమకారణము బ్రహ్మమే యగుచుండుటచే. బ్రహ్మజాతమే ఈ సృష్టియని చెప్పవలెను. అయితే బ్రహ్మము ఏకము, అద్వితీయము, నిరుపాధికము గాన నందుండి జాతి అనగా జన్మ యేదియు రాజాలదు గాన, ప్రాతిభాసిక జాతి, లేక సృష్టిసుమా యిది, యని చెప్పబడినది. 'తస్మాత్త త్సుకృత ముచ్యత ఇతి' యని శ్రుతి స్వయముగనే సృష్టినిగురించి కృతాఽకృతవాదమును నిరసించి, సుకృతవాదమును బోధించుచున్నది. దీనినే సుజాతవాదమని శ్రీ గురుదేవు లనుచుండిరి. 'బహుస్యాం ప్రజాయేయ' అనినరీత్యా, దీనినే బ్రహ్మ బహుభవ మని యనిరి.

ఇట్లు దృష్టి సృష్టిరీత్యా జగత్తు బ్రహ్మయొక్క తాత్త్విక ప్రతిభాసమే. ఇంకనూ యీ జగత్సత్యత్వమును బ్రహ్మప్రతిబింబత్వేన గూడ తెలియవచ్చును. జగత్తు బ్రహ్మ యనెడి చిద్దర్పణమున భాసిల్లుచున్నది. మామూలు అద్దము జడమగుటచే, దానియందలి ప్రతిబింబము తనది గాదు, అన్య వస్తువుది, కనుక మిథ్య. బ్రహ్మదర్పణమందలి జగత్ప్రతిబింబమో స్వవివర్తమైన స్వప్రతిబింబమే గాన, తానెట్లు సత్యవస్తువో, తన ప్రతిబింబముగూడ తననుబట్టి సత్యమైనదే యగును.

అయితే బ్రహ్మ యనెడి యీ చైతన్యదర్పణమే గదా చేతనులమైన మనమందరమును! ఇట్టి మనకు స్వాత్మను తెలిసికొనుట సులభసాధ్యము గాకున్న దేమి? యనెడి శంక తోచుచున్నది. ఇందుకు పరిహారమేమన - ఆ విద్యకులు గాంచెడి ద్రష్టృ దృశ్యభేద మంతయును, సర్వద్రష్టయైన బ్రహ్మము యొక్క నిరంకుశ స్వాతంత్ర్యమువలన నేర్పడిన నర్తనమే గాన, స్వాత్మవిస్మరణముగూడ (మరుపులేక, అజ్ఞానము గూడ) నీ నర్తనముతాలూకు ఒక విలక్షణమైన యభినయమే. అట్టి విస్మరణము తిరిగి యీ బ్రహ్మమువలననే అపావృతము కాదగినది

ప్రకృత మేమన— ఈ చిద్దర్పణమనెడి దృగ్వస్తువు తన సాన్నిధ్యమాత్రముననే, క్రియాకారక నిరపేక్షముగా, నిఖిల జగద్దృశ్యములుగా ఉన్నట్లుగను, లేనట్లుగనుగూడ అనగా భావాభావరూప సకలద్వైతముగా తోచగలదు. ఇట్టి చమత్కార మా సద్వస్తువునకు స్వరూపమేగాని, అతిరిక్తమైన ధర్మముగాదు స్వరూపము, సాన్నిధ్యము, స్వభావము, స్వాతంత్ర్యము అనెడి పదములు ఈ జగచ్చిత్ర చిత్రదర్పణముపట్ల పర్యాయపదములే, అనగా సమానార్థకములేయై యున్నవి. నిఖిలద్వైతరూప జగజ్జననశక్తి, సచ్చిదానందస్వరూపమైన తానే. ఈ శక్తివశమున, తానే అనృత జడదుఃఖాత్మకముగా భాసించును. అఖండ తేజస్సైన తానే పెంజీకటివలె భాసించును ఈ అద్భుతశక్తినే "అఘటితఘటనా పటీయసీ మాయా" అని కోవిదులు చెప్పెదరు. "నాఽస్త్యభావ విభాసినీ" అని చెప్పబడిన చిద్విలాస మిదియే. నాస్తియని యెన్నబడెడి

అభావరూపముగకూడ భాసిల్లునది పరసంవిత్తే. ఇట్టి సద్వస్తు లీలావైభవమే జగత్తుగాన. నీజగత్తుకూడ బ్రహ్మ సమసత్తాక మైనదేగాని విషమసత్తాక మైనది గాదు ఈరీత్యా "బ్రహ్మ సత్యం జగన్మిథ్య" యనుసూక్తికి "బ్రహ్మ సత్యం జగద్బ్రహ్మ" యను నిర్వచనమునే చెప్పదగును. అనగా జగత్తు 'బ్రహ్మ' యను సమన్వయ మనుట.

ఇట్లు దృశ్యమంతయు బ్రహ్మమేయని తెలినది. దేశములు, కాలములు, వస్తువులు, స్థావరములు, జంగమములు అనెడి 84 లక్షల జీవరాసులు, జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు మొదలుగాగల సర్వము బ్రహ్మమే యని ఒప్పక తప్పదు. పూర్వము జాగ్రద్దృశ్యమునుగూడ స్వప్నమువలె అసత్యమనియు, మిథ్యయనియు చెప్పకొని యుంటిమి కాని ఈ చెప్పబడిన ఆహార్యాధ్యాసబోధ ననుసరించి, స్వప్నముగూడ సత్యమే యని తెలియుచున్నది. స్వప్నమున గల్పింపబడిన దంతయు సాక్షికృతియే గదా! అచట స్వయంజ్యోతియగు సాక్షిదక్క రెండవ వస్తువు లేదుగదా! సాక్షియన ప్రత్యక్ బ్రహ్మమే గదా! కనుక స్వప్నము ప్రత్యగాత్మయగు సాక్షిభాస్యముగాన అమృష యనియే పెద్దలు గణించిరి. శ్రీరామానుజాచార్యులున్నూ స్వప్నము సత్యమేయని వ్యాఖ్యానించిరి. వారుచూపిన యుపపత్తి ఏదన — ప్రాజ్ఞ కల్పితమైనది గాన స్వప్నసృష్టి తథ్యమైనదనుట. ఇందుకు అద్వైతులు చూపెడి ఆమోద మెట్టిదన ప్రాజ్ఞ కల్పితముగాని సృష్టి లేనేలేదు. జాగ్రత్సృష్టి కూడ ప్రాజ్ఞకృత మైనదే; కాని ప్రాజ్ఞుడెట్లు ప్రత్యగాత్మయందు కాల్పనికుడో (కల్పించబడినవాడో) అట్లే తత్కృత సృష్టి

గూడ కాల్పనిక సత్యమే (కల్పించిన సత్యమే) అనగా మిథ్యయే. ప్రాజ్ఞుడు నిజమునకు అస్మత్ప్రత్యయగోచర ప్రత్యగాత్మయే. ఈరీత్యా ప్రాజ్ఞసృష్టి నిజమునకు ప్రాజ్ఞునితో సహా ప్రత్యగాత్మ యొక్క చిద్విలాసమైనదే. "సాక్షిన్యేవ సకలం జగదధ్యస్తమ్" అనెడి సూక్తి యిదియే. ఈ రీత్యా సకలసృష్టియు శ్రీరామానుజులు సంతోషింపదగినట్లు తాత్త్వికమే యగును.

ఇట్లు దృష్టి సృష్టి ప్రక్రియానుసారము బ్రహ్మేతరవస్తువు లేనేలేదనియు, ద్వైతప్రతిభాస ముండువరకున్నూ ఈ జగ మంతయు బ్రహ్మముయొక్క స్వతంత్రవిలాసమే యనియును నిరూపించుటయైనది. ఇక మీదట నీప్రక్రియానుసారముగ యాగ దానాది కర్మాచరణమును, దయా సత్య శౌచాది సదాచారమును, అనుష్ఠించెడి పద్ధతినిగూడ నొకింత వివేచింపదగును. కనుక నీ పిమ్మట నీ సందర్భమును ప్రస్తావించెదను.

## I. విషయనిరూపణము

### (B) సాధనవిచారము

### (i) జ్ఞాననిష్ఠ లేక సమాధిస్థా నిరూపణము.

మొదటి పరిచ్ఛేదమున ప్రమేయవిచారమున వస్తుతత్త్వ వివేకము దృష్టిసృష్టినిబట్టి తెలుపబడినది. ఇది తత్త్వవిచారమున శ్రవణ మనన భూమికల క్రిందికి చేరును. కేవలము శ్రవణమననముల వలననే తత్త్వజ్ఞానము కలుగనేరదు. ఇది శబ్దార్థశిల్పమే యనియు, నింతమాత్రమున తత్త్వానుభూతి కలుగజాలదనియును "శబ్దార్థ శిల్పమాత్రేణ నహి తత్పద మాప్యతే" యని చెప్ప

బడినది. కనుక అనుభూతి కొఱకే "నిష్ఠ" యవసరమగు చున్నది. ఈ నిష్ఠ సమాధినిష్ఠ యనియు, క్రియానిష్ఠయనియును ద్వివిధమై యున్నది. దృష్టి సృష్టి వేదాంతానుసారము క్రియ గూడా చిచ్చమత్కారమనియే యెన్నబడినదిగాన, నిదియు నొకప్రకారమైన జ్ఞానమనియే లెక్కింపబడినది. ఇందువలన జ్ఞానక్రియానిష్ఠలు రెండును బ్రహ్మనిష్ఠాప్రకారములుగనే పరిగణింపబడు చున్నవి. మొదటిది ఆంతరబ్రహ్మ నిష్ఠయనియు, రెండవది బాహ్యబ్రహ్మనిష్ఠ యనియును గ్రహింపబడుచున్నది. ఈ ద్వివిధ బ్రహ్మనిష్ఠానిరూపణమే ఇక ప్రస్తుతమైనది. ఇందీ ప్రకరణమున ఆంతరబ్రహ్మనిష్ఠ యనెడి జ్ఞాననిష్ఠ లేక సమాధి నిష్ఠావివరము తెలుపబడుచున్నది

ఇచట జిజ్ఞాసువులకు కలిగెడి యొకయాశంక యేమన— పూర్వపరిచ్ఛేదమున "సర్వం బ్రహ్మాత్మకమే" యని నిర్ణయించితిరి గదా! ఇట్టితరి మనకెవరికిని సాధనావశ్యకతగాని, గురుశిష్యాది భావానుశీలనముగాని అనవసరమే యగును గదా? అని. ఇందుకు సమాధానమును వినుడు. మాండూక్య శ్రుతి కారిక — "ఉపదేశాదయం వాదో। జ్ఞాతే ద్వైతం నవిద్యతే" యని యీశంకను పరిష్కరించినది. భావమేమన — తత్త్వప్రబోధముకంటెను ముందు సాధనావశ్యకతయు, గురువు, శిష్యుడు, శాస్త్రము అనెడి వ్యవహారమంతయును మనకు పరమార్థ తత్త్వప్రబోధమును కలిగించుటకే అయియున్నది. తత్త్వసాక్షాత్కారము కలిగిన పిమ్మట నేదియు నవసరము గాదు అని. కనుక సారాంశమేమన — మనకు సహజముగనే అపరోక్షమైయున్న అప్రబోధము నివర్తించుటకై, అనగా

సర్వము బ్రహ్మాత్మకముగనే యున్నది యనెడి యెఱుకలో సహజముగనే మనము లేకనున్నారము గాన నిట్టి యపస్మారము తొలగి శుభస్మృతి మనకు కలుగగలందులకు ఈ సాధనాది వ్యవహారమంతయు నావశ్యకమైన దనుట. అయితే యీనిష్ఠలు ప్రబుద్ధులైన సిద్ధుల కనవసరములే గదా యనుచో, నిజమే! అనవసరములే. వారికి నిష్ఠలు స్వభావలక్షణములేయై యమరును; సాధకుల కన్ననో యివి యభ్యాసలక్షణము లగును.

ఇక ప్రస్తుతమైన సమాధినిష్ఠావివరమును తెలియుదము. ఈ సమాధికి పూర్వభూమిగా నిదిధ్యాసము గలదు. సమాధి యొక్క ఆరంభదశయే నిదిధ్యాసము. కనుక సమాధివివేకము ననే నిదిధ్యాసవివేక మంతర్భవించును ప్రత్యేకముగా నిదిధ్యాసమును వివరింప బనిలేదు. సర్వప్రపంచము ప్రత్యక్పరబ్రహ్మము యొక్క దృష్టి సృష్టి యనెడి స్వతంత్రవివర్తమే గాన, స్వర్ణ తదాభరణన్యాయమున, తాత్త్వికమైనదనియే నిర్ణయింపబడిన శాంకర వేదాంతహృదయమును గమనించితిమి. (తాత్త్వికమన కూటస్థసత్యమని భావము కానేరదు. మరేమన – ప్రతిభాసించెడి కాలమున వస్తుతంత్రముగనే భాసించును గాన, అమృషా ప్రతిభాసమే గాని, మృషాప్రతిభాసము కాదనుట) ఈ నిరీక్షణము మనకెట్లు కలుగునో యట్టి సదుపాయమే మనకు ముఖ్యమైనది జగద్దృశ్యములందు బ్రహ్మభావమును చేయుచు, కాలక్షేపము చేయుటే చాలునా? లేక, ఇట్టి తత్త్వరహస్యమును సాక్షాత్కరించుకొనదగిన నిష్ఠాసాధన మేదైన కలదా? ఇది ప్రస్తుతము మన మిచట తెలియవలసిన యంశము.

సాధకుని చలన్మనస్సు జగద్దృశ్యమున నేఁత ప్రత్యక్-బ్రహ్మభావమును జేసినను, చిత్తైకాగ్రతానిష్ఠ యీ ప్రత్యగ్బ్రహ్మలక్ష్యమున అభ్యసింపకున్నచో, చిత్తమునకు ప్రత్యఙ్ముఖత కుదురజాలదు. ఇందువలన నిట్టి యేకాగ్రతాసాధనమునే మన మిపుడు గమనింపవలెను. శ్రీగురువులు ఈ సాధనమును "ఆకాశమందు ఆత్మనిష్ఠ" యని పేర్కొనిరి. దీని వివరమేమన — సాధకుడు తన యెదుట నభావరూపమున, అనగా శూన్యరూపమున గోచరించుచుండెడి ఆకాశమందు ఆత్మనిష్ఠను చేయవలెననుట. తన చలన్మనస్సును సాధకుడు సర్వవ్యాపకమైన ఆకాశరూపముగ భావింపవలెను. ఆకాశము వేదాంతి మతమున 'అభావము' గాదు. శూన్యవాదిబౌద్ధునకు మాత్రమే ఇది యభావము. "ఆత్మన ఆకాశ స్సంభూతః" అనెడి శ్రుతి ననుసరించి, ఆకాశమును వేదాంతి భావపదార్థముగనే గ్రహించినాడు. ఇందువలన ఆకాశరూపమున భావింపబడెడి సాధకుని మానసము అణుత్వమును, చలత్వమును వీడి వ్యాపకమై నిలచును. ఆకాశమునకో జడత్వము తొలగి చేతనత్వము ఉన్మీలితమగును. ఇందుమూలమున సాధకుని స్వరూపము సర్వవ్యాపకమును, అచలమును, కనుకనే నిరాలంబమును అగు చేతనాకాశమగును. సజాతీయ విజాతీయ స్వగతమగు ద్వితీయభావమేదియు నిందు లేనందున, నీ స్వరూపము నిరాలంబమునన్ను, అచలసంవిత్తు అని చెప్పబడెడి అఖండాఽద్వయ జ్ఞప్తిమాత్రమై యుండును. ఈ జ్ఞప్తియే స్ఫురత్ప్రకాశమనియు, చిత్ప్రకాశమనియును తత్త్వవిదులచే తెలియబడును. చిత్ప్రకాశ మన, ప్రజ్ఞానమనెడి తేజస్సు లేక జ్యోతిస్సు. "జ్యోతిషా మపి తజ్జ్యోతి

స్తమసః పర ముచ్యతే" - యని చెప్పబడిన, సర్వదృశ్య జ్యోతి స్సుల నన్నిటిని వెలిగించెడి, పరంజ్యోతి యీ చిత్ప్రకాశమే గాని చైతన్యవాచకమగు జ్యోతిశ్శబ్దముచే మనము ఆదిత్య చంద్రాగ్ని విద్యుత్ప్రకాశముల గ్రహింపరాదు "న తత్ర సూర్యో భాతి" - ఇత్యాది శ్రుతు లీ భావమునే చెప్పారు. చేతనులమైన మనము వీక్షించిననే యీ సూర్యచంద్రాది జ్యోతు లగపడునుగాని, లేనిచో కనరావుగదా! కనుక చేత నులమైన మనమే నిజమైన జ్యోతిస్సు సుమా యని తెలియ వలెను. ఇక, ప్రకృతవిషయమున సారాంశమేదన - ఆకాశము నందు ఆత్మనిష్ఠను సాధించిన సాధకుడు ఇట్టి స్ఫురత్ప్రకాశమగు అఖండ ప్రజ్ఞప్తిస్వరూపముతో ఆవిర్భూతుడై నిలుచుండును అనునదే.

సాధకుని చలన్మనస్సు ఈ చెప్పబడినరీత్యా అఖండ చిదా కాశస్వరూపమున నావిర్భవించిన మీదట లోగడ భూతాకాశ స్థితములుగా గోచరించుచుండిన జడాజడవ్యక్తులన్నియు స్వాకా రములను విడచుకొని యీ చేతనాకాశ భావమునే చెందును. ఇక నీ సాధకుని వ్యుత్థానావస్థయందు అతనికి తిరిగి ద్వైతప్రపం చము యథాపూర్వముగ భాసించినను, దీనియం దతనికి ద్వైత బుద్ధి ప్రోక్తసమాధినిష్ఠానుభూతివలన ఉన్మీలిత మాయెగాన జగమంతయు 'సన్మూలాః సదాయతనాః సత్ప్రతిష్ఠితాః' అనిన చందమున చిదాకాశస్థిత చిద్విలాసముగనే గోచరించునుగాని, బాహ్యమైన త్రైగుణ్యదృశ్యముగా తోచనేతోచదు. అనగా నతని సమాధిలక్ష్యమైన చిత్సముద్ర తరంగములుగా నీప్రపంచ దృశ్యములు తెలియబడు ననుట. దీనినే స్థూలసూక్ష్మాత్మక తత్వాను

భూతియని శ్రీగురువులు సెలవిచ్చుచుండిరి. స్థూలమనేది వ్యుత్థానావస్థాలక్ష్యము; సూక్ష్మమనెడిది సమాధ్యవస్థాలక్ష్యము; ఈ రెండును ఒక్కేతత్త్వమని భావము. సముద్రమున తరంగభావమెట్లు విడిపోదో అట్లే ప్రోక్తసాధకగోచర స్థూలప్రపంచమున చిదాకాశమనెడి సమాధిరసమట్లే విడిపోదు. అనగా సముద్రోదకమే అవికృతముగా తరంగమువలె తోచునట్లు, సమాధిలక్ష్యమైన దహరాకాశమే, సమ్యగ్దర్శననిష్ఠులకు తత్త్వవ్యుత్థానావస్థలో అవ్యక్తాద్యస్మత్ స్థూలదేహాంత క్షరాక్షర దృశ్యములుగా తానవికృతముగనేయుండి తోచుననుట. ఇట్టి చిద్విలాస ప్రపంచమే బాహ్యబ్రహ్మనిష్ఠకు ఆస్పదమయ్యెడిది. ఈ వివరము నికముందు తెలియగలము.



1. (B) (2) దృష్టిసృష్టి వేదాంతానుసారము

కర్మనిష్ఠ యనెడి బాహ్యబ్రహ్మనిష్ఠ.



'స్వే స్వే కర్మణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః'

'స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః'

'బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరంతప ।

కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవై ర్గుణైః॥'

'శమో దమ స్తప శ్శౌచమ్' – 'శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యమ్'

'కృషిగోరక్ష వాణిజ్యమ్' – 'పరిచర్యాత్మకం కర్మ' —

ఇత్యాదిగా శ్రీ ఈశ్వరగీతలందు భగవానుడు మానవునకు యాగ దాన హోమాది స్వధర్మాచరణమును, శమదమాది

సదాచారానుశీలనమును విహితములని బోధించినాడు గదా! సత్యాహింసా వైరాగ్యాది సామాన్య ధర్మములుగాని, యీ చెప్పబడిన వర్ణాశ్రమప్రయుక్త విశేషధర్మములుగాని, సృష్టి దృష్టిపక్షమునందువలెగాక ప్రస్తుతమైన దృష్టిసృష్టిబోధ ననుసరించెడి 'సర్వం బ్రహ్మాత్మకమ్' అనెడి అఖండ బ్రహ్మాత్మ దృష్టిలో నెట్టి విశిష్టతను గలవిగా నుండునో మన మీ ప్రకరణమున తెలియవలసి యున్నారము.

ఈ ఘట్టమున ముఖ్యముగా మనకు కలుగదగిన సందేహమేమన – సర్వ చేతనాచేతనములును బ్రహ్మమే యగుచో, వీడు కర్త, వీడు భోక్త, వీడు బ్రాహ్మణుడు, వీడు బ్రాహ్మణేతరుడు, ఇది పురుషవ్యక్తి, ఇది స్త్రీవ్యక్తి, ఇది పశువు, ఇది పక్షి – యీ మొదలగు విభాగమే ప్రపంచమున కుదురదు గదా? ఇట్టిచో పూర్వోక్తధర్మానుష్ఠానము సాగుటెట్లు? ఈ విభాగము నెట్లో యొకవేళ కుదిర్చినప్పటికిని, ఈ ద్వైత నానాత్వము నంతను ఉపేక్షించి, 'సర్వం బ్రహ్మ' యని యభ్యసించుటెట్లు? ఇట్లైననేగదా బాహ్య బ్రహ్మనిష్ఠ కాగలిగెడిది? పూర్వోక్త ఆంతరసమాధినిష్ఠ యున్ననో నామరూపరహిత నిర్విశేషభావనాత్మకమైనది గాన, అనగా సర్వ ద్వైతమును ఎగురగొట్టెడి సమభావాభ్యాసరూపమైనది గాన, పొసగునని గ్రహించితిమి. ప్రస్తుతమైన కర్మనిష్ఠ యట్టిది కాదు గదా? ఇందు ద్వైతనానాత్వము నెగబెట్టి కేవల నిర్విశేష భావనము సంభవింపదు గదా? – యని యీవిధమైన ప్రబలతర సందేహమొకటి ఆటంకపరచెడి మాట నిజము. ఇందుకు పరిహార మీ దిగువ నిరూపింపబడుచున్నది.

శ్రీశంకరులే యీశంకను బ్రహ్మసూత్ర భాష్యమున "భోక్తృభోగ్యాఽవిభాగాధికరణమున" పరిష్కరించిరి. సర్వ నామరూపములును బ్రహ్మమే యగుచో కర్తయే భోక్తకావచ్చును. పురుషుడు స్త్రీకావచ్చును స్త్రీయే పురుషుడు కావచ్చును. బ్రాహ్మణుడు శూద్రుడు కావచ్చును. శూద్రుడే బ్రాహ్మణుడు కావచ్చును. మనుష్యుడు పశువు కావచ్చును. పశువు మనుష్యుడు కావచ్చును. ఈరీత్యా లోకమున విభాగవ్యవస్థలే లేకపోవునుగదాయని బ్రహ్మవాదిపై తార్కికుడు పూర్వపక్షము గావింప, నీక్రింది పరిష్కారము చెప్పబడినది. సముద్ర వికారములగు ఫేనవీచీతరంగబుద్బుదాదులు సముద్రముతో నభిన్నములేయైనను, ఒకటి మరొకటిగా నేర్పడక నేదానికది విశిష్టముగనే యెట్లమరియున్నవో, యటులనే బ్రహ్మవిలాసమే సర్వజగత్తును అయినను పైశంకింపబడిన సాంకర్యమేర్పడదనియు, స్త్రీపురుష, బ్రాహ్మణాబ్రాహ్మణ, పశుపక్షి, మృగ కీటాది విభాగమునకుగాని, శాస్త్రోక్త ధర్మాధర్మాది వ్యవస్థలకుగాని యేవిధమైన బాధయు వాటిల్లదనియు గ్రహింపవలెనని తీర్మానింప బడినది. కనుక జగన్మిథ్యావాదమున నీపైసందేహ మనవసరము. కాని ద్వైతవ్యవస్థ కుదిరెనేని సర్వత్ర సమభావ నిష్ఠయ నెడి "బాహ్యబ్రహ్మనిష్ఠ యెట్లు? అను శంకాపరిహారము"

"సువిశాల మిదం విశ్వం పవిత్రం బ్రహ్మమందిరమ్"
"న విశేషోఽస్తి వర్ణానాం సర్వం బ్రాహ్మ్య మిదం జగత్"
"నిస్త్రైగుణ్యే పథి విచరతాం కోవిధిః కోనిషేధః" ఇత్యాది వచనములందు "సర్వం బ్రహ్మ" యనెడి అద్వైతదృష్టిగల సిద్ధులగువారికి వర్ణాశ్రమాది విభాగముగాని, విధినిషేధ వ్యవస్థ

గాని గోచరమే కాదని చెప్పబడినదిగదా ! యను ఈ వచనములు అపరోక్షజ్ఞానులగు సిద్ధపురుషుల స్థాయిని తెలుపునవి. ఈ సిద్ధ పురుషులకు వర్ణాశ్రమాది ధర్మాధర్మ వ్యవస్థలు గోచరింపవని యీ వచనముల భావముగాదు. మరేమన నీవ్యవస్థలు గోచ రించినను వీనియందు వీరికి అభినివేశముండదని మాత్రమే యిచటి భావము అనగా శాస్త్రవ్యవస్థలు నియతములనియు వీని యాచరణానాచరణములవలన లాభాలాభ జయాజయ సుఖదుఃఖాది ద్వంద్వఫలములు ఘటిల్లుననియును వీరు భావిం పరు. "తత్త్వ మాధ్యాత్మికం దృష్ట్వా తత్త్వం దృష్ట్వాతు బాహ్యతః। తత్త్వభూత స్తదారామో యతిర్యాదృచ్ఛికో భవేత్" అనిన చందమున వీరు సకలజగత్తునను బాహ్యాభ్యం తరము లందంతటను స్వాత్మబ్రహ్మమునే నిరీక్షించెడి వారలై నియతిప్రారబ్ధముల నుపేక్షించి యదృచ్ఛావ్యవహారపరులై యుందురని పై వచనముల తాత్పర్యము.

సాధకులన్ననో యీ సిద్ధస్థాయిని ఆదర్శముగా పెట్టుకొని వీరి సమశీలతను చెందుటకై క్రమక్రమముగ యత్నించుచు, ధర్మా ధర్మవ్యవస్థల శాస్త్రోక్తరీతిన సద్భావసాధుభావములతో నవలం బించి ధన్యులగుదురు. సిద్ధపురుషులయొక్క తత్త్వజ్ఞానమే వీరికిని అమరియుండును. ఈ ప్రజ్ఞ వీరికి సిద్ధపురుషులకువలె ఆరూఢమై యుండదు అనగా స్థిమితపడి యుండదు. అనగా స్థితప్రజ్ఞులు గారనుట. భావసంశుద్ధిమాత్రము సిద్ధులకెట్టిదో వీరికిని అట్టిదే. ఈ భావశుద్ధినే యీ దిగువ నొకింత గమనింతము.

సర్వత్ర సర్వదా సంసరించుచుండెడిది పరబ్రహ్మమే సుమా యనెడి సచ్ఛ్రద్ధ యీమార్గపు సాధకున కమరియుండును.

"సర్వవ్యవహార భాగ్బ్రహ్మ" యనెడి మంగళసూత్ర మిదే. మంగళసూత్ర మన బ్రహ్మసూత్ర మన్నమాట "బ్రహ్మ తన్మంగళం పరమ్" అని చెప్పబడినమాట ఇదే. తనయందును యెదుటివారియందును వ్యవహరించెడువాడు బ్రహ్మమేయనెడి సద్విశ్వాసమే యీ మంగళసూత్రమని భావము. బ్రహ్మమే సాధకుడైన తానుగా నటించుచున్నాడని యీమార్గపు సాధకుడు వ్యవసాయాత్మకబుద్ధిని కలిగియుండును. ఇదియే ఈశ్వరగీతలందు సాంఖ్యబుద్ధి నాశ్రయించిన యోగబుద్ధియని నిరూపింపబడినది. ప్రకృతసందర్భమున సాంఖ్యబుద్ధియన, దృష్టి సృష్టి ప్రక్రియా రీత్యా సర్వప్రపంచమును బ్రహ్మరూపమైనదేయని మనచే సంగ్రహింపబడిన వివేకమే. ఇక నిచటి యోగబుద్ధియన, నీ విశిష్టవిజ్ఞానము ననుసరించి క్రియాపథమును మెట్టుట. "ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు" అని చెప్పబడిన సూక్తి యిదే.

తత్త్వవివేకము ననుసరించెడి సాధనపద్ధతి యెట్లుండవలెనో, యీ వివరమును శ్రీగీతయే యీ దిగువ శ్లోకములందు వక్కాణించినది. 'వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునందన!' 'త్వయి మయి సర్వత్రైకో విష్ణుః' అనినట్లును, 'బహిరంతశ్చ భూతానాం అచరం చరమేవ చ' అనినట్లున్నూ, సర్వప్రాణులందును అఖండముగా వ్యాపించి వ్యవహరించెడివాడు పరమేశ్వరు డొక్కడే యనెడి, నిశ్చయబుద్ధిని ప్రతిసాధకుడు కలిగియుండవలెను – అనుటే పై గీతాసూక్తి యొక్క భావము. మరియును, 'మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాఽధ్యాత్మ చేతసా। నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః' – 'కర్మ

ణ్యకర్మయః పశ్యే దకర్మణి చ కర్మయః' – 'బ్రహ్మార్పణం బ్రహ్మహవి బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ । బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మ సమాధినా' – 'ఆత్మసంస్థం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ' – 'బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః' – 'తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః' । గచ్ఛం త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూత కల్మషాః' – ఇత్యాదిగా గల శ్లోకములందు భగవంతుడు స్పష్టముగనే కర్మమార్గసాధకుని బుద్ధివ్యవసాయ మెట్లుండవలెనో విశదీకరించెను భగవత్ప్రవృత్తికి విరోధమైన స్వప్రవృత్తి నివృత్తినే సర్వదా సర్వకార్యాచరణమునందును సాధకుడనుసంధింప వలెనని పై సూక్తులన్నిటికిని పరమతాత్పర్యమై యున్నది.

బ్రహ్మప్రపంచ శ్రద్ధగల జ్ఞానులు భగవంతుని ఏ సందర్భమునను మరచియుండరు. "పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్" అనెడి ప్రహ్లాదుని జీవనవృత్తమే యిందుకు నిదర్శనము. ఇతడు గావించిన భగవన్నామస్మరణము గూడ తత్స్వార్థాత్మత్వ వివేక విశ్వాసములతోడనే యొనరించెను. గజేంద్రుని భక్తియు నిట్టి యద్వైతాత్మస్ఫూర్తితోనే జరిగెనని పెద్దలు చెప్పిరి. స్థూలదృష్టికి యీయాచరణములు ద్వైతభక్తి వలె కనబడును, కాని అంతర్లక్ష్య మద్వైతభగవానుడే. తినుట, త్రాగుట, నడచుట మొదలగు క్రియ లన్నిటిని ప్రహ్లాదుడు బ్రహ్మప్రవృత్తినిగనే దర్శించెను. ప్రతి యొక దృశ్యమును బ్రహ్మముగనే నిరీక్షించెను. కనుకనే తండ్రిపెట్టిన నానాభీభత్స క్లేశములందంతటను ఆత కెంతమాత్రమును విక్షేపమును జెందడాయెను. "తన్ను నిశాచరుల్ బొడువ దైత్యకుమారుడు

మాటిమాటికిన్ రోమాపన్నగళాయి, దనుజభంజన యంచు కీర్తించు" అనినట్లు అతడు నిశాచరులను, వారిని ప్రేరేపించి యాతనిపైకి బంపిన తండ్రినిగాని, అఖండపరబ్రహ్మము దాల్చిన వేషములనుగనే - 'నర్తకుని భంగి పెక్కగు మూర్తులలో నెవ్వడాడు' అని చెప్పినచొప్పున సంభావించి, తనను సైతము శ్రీహరి యొక్క మూర్తివిశేషముగనే 'బ్రహ్మైవాహమస్మి' యనెడి మహావాక్యార్థసరణిని నిశ్చయించుకొనినవాడై, యీ సన్నివేశ మంతయు అద్వయపరమేశ్వరుని లీలావిహారమే సుమా యనెడి సద్భావసాధుభావములం గలిగియుండె గాన, నాతనికి 'యస్మిన్ స్థితే న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే' యనిన చందమున రవ్వంతయు హాని కలుగదాయెను గదా.

సురాసుర నర తిర్యగాది సకల నామరూప జగత్తును అతనికి హరిరూపముగనే గోచరించెను. 'జగద్రూపం తతో ద్వయమ్' అనిన మాట యిదియే గదా! హరిమయముగాని విశ్వ మాతనిదృష్టిలో పరమాణువుగూడ లేకుండెను. "సర్వము న్నతని దివ్యకళామయమంచు విజ్ఞానం దుల్లము జేర్చి" యని సూచింపబడిన సదధ్యవసాయవంతు డీతడు. హరితో జగతో భిన్నతనువంటూ ఆతని కగపడనేలేదు. "సర్వం ఖల్విదం బ్రహ్మ నేహ నానాస్తి కిఞ్చన" యనెడి శ్రుతిసూక్త్యనుసారము సర్వ ప్రపంచమున్నూ తనతోసహా బ్రహ్మబహుభవనమే యనెడి సుశ్రద్ధయన నిదియే 'యో యచ్ఛ్రద్ధ స్స ఏవ సః' యనెడి భావ మిదియే.

అఖండ భగవన్నిష్ఠయన నిదియే. "స్వస్వరూపం హరి స్సాక్షాత్" అనిన సాక్షాత్ హరినిష్ఠ ఇదియే "సర్వం సర్వా

త్మకం సర్వం సర్వత్ర ఉపలభ్యతే" యనెడి శుద్ధాఽద్వైతనిష్ఠ ఇదియే అనగా ప్రతివ్యక్తిరూపముననూ ప్రత్యక్పరమేశ్వరుడే వెలసియున్నాడుగాన, ప్రతివ్యక్తియు తన ప్రత్యగ్రూపముతో ప్రతివ్యక్తియు నగుచున్నాడని భావము. ఇట్టి సర్వాత్మభావ శ్రద్ధతో నిర్వర్తింపబడెడి క్రియాపథమంతయు బ్రహ్మపథమే యనగా ప్రత్యగ్బ్రహ్మముయొక్క ఆత్మరత్యాత్మక్రీడారూప జీవన్ముక్తవ్యవహారమే. "న వేదయజ్ఞాధ్యయనైర్న దానైః। నచ క్రియాభిర్నతపోభిరుగ్రైః॥" యనినట్లును, "నాఽహం వేదైర్నతపసా। న దానేన న చేజ్యయా" అనినట్లును, బ్రహ్మము నీ విధమున సర్వజగద్రూపునిగ నెఱుంగుట సామాన్యమానవు నకు సంభవముగాదు. 'ఈశ్వరానుగ్రహాదేవ పుంసా మద్వైత వాసనా' యనెడి వచనానుసారము పరమేశ్వరానుగ్రహవంతు లకేగాని, ఈ చెప్పబడిన జగద్బ్రహ్మ వివేక మంకురింపజాలదు.

ఈ జగద్బ్రహ్మబోధ ననుసరించి బహిర్ముఖత్వము, అంత ర్ముఖత్వమను భేదమేర్పడదు. ఈ దృష్టిలో బ్రహ్మమునకంటెను బాహ్యపదార్థమే లేదు. బాహ్యమంతయు ఆంతరమైన బ్రహ్మ సత్తాకమే యని యిచటి బోధ. ప్రపంచమంతయు బ్రహ్మ స్వరూప విలాసమే యగునపుడు స్వర్ణతదాభరణములకు గల బాహ్యాభ్యంతర భావమువంటిదే యీ పట్లను బాహ్యా భ్యంతరభావమై యుండునుగదా! సర్వత్ర బ్రహ్మదర్శనమే యేర్పడును గాన, ద్వైతమున దృశ్యభ్రమను చేయకుండుటే ద్వైతము లేకుండుట యగును. ఇంతియగాని, ద్వైత మసలే గోచరింపకుండుట గాదు. ప్రవృత్తినివృత్తి భావములు కూడ నిచట నీ విశిష్టత కలవే. నిర్వికల్పముగ కూర్చుండుటే నివృత్తి

యనియు, ప్రపంచములో వ్యవహరించుటే ప్రవృత్తియనియును, ఈ దృష్టియందు ఏర్పడవు. సర్వత్రా బ్రహ్మయే ప్రవర్తించు చున్నాడనెడి సద్భావము విచార, మనము ప్రవర్తించు చున్నచో, మన ప్రవృత్తి నివృత్తియే యగును. దృశ్యమందు ఇది దృశ్యమే యనెడి భ్రాంతి నివర్తించి, సర్వాత్మభావముతో మనము ప్రవర్తించుచో, నిది ఆత్మరత్యాత్మక్రీడ యనే బ్రహ్మముయొక్క జీవన్ముక్తవ్యవహారమే యగును. ఇదే భ్రాంతిప్రవృత్తి నివృత్తియే.

ఈ నిరూపింపబడిన జగద్బ్రహ్మవివేకము ననుసరించి క్రియాపథసరణిలో యజ్ఞదానాదికర్మలు, సత్యాహింసాది వృత్త మును సాధకులచే నెట్లు నిర్వర్తింపబడునో యిక తెలియుదము. 'యది తే కర్మ విచికిత్సా వా వృత్త విచికిత్సా వా స్యాత్' అనిన చొప్పున క్రియారంగమంతయు కర్మపద్ధతి యనియు, వృత్తాను శీలన మనియును ద్వివిధమై యున్నది. వృత్తమన సదాచార మని భావము. ముందు కర్మపద్ధతిని గమనింతము.

కర్మపద్ధతి:— ఇందు మొదటనే ధ్యానక్రియను తెలి యుదము. ఏలయన — ఆంతరధ్యానమనెడి సమాధినిష్ఠనుగదా యింతకుముందు విచారించితిమి. వెనువెంటనే బాహ్యధ్యాన విచారము సుసంగతమగును.

(1) ధ్యానక్రియ:— 'నారాయణ పరో ధ్యాతా ధ్యానం నారాయణః పరః' అని విశిష్టమైన ధ్యానపద్ధతి చెప్పబడినది. ఇట్టి ధ్యానక్రియ అద్వైతదృష్ట్యా జరిగెడిదే. బాహ్యమైన నిదిధ్యాసన మిది. ఆంతరనిదిధ్యాసనము ఆంతరసమాధికి పూర్వ

భూమిక గాన, నందే అంతర్భవించునని వింటిమిగదా! ప్రస్తుత
మీ బాహ్య నిధిధ్యాస పద్ధతిని తెలియుదము. పరోక్షమున
ధ్యేయాకార దైవస్వరూపమును, ధ్యానించువాడును, ఏర్పడి
యుండగా ఈ అభేద ధ్యానమెట్లు జరుగును? అని సందేహిం
తుము గదా! దీని పరిహారోక్తి అవశ్యము వినవలయును.
మనసును దైవస్వరూపమననముచే దైవాకార మొందించుట
యనెడి ఆంతర్లక్ష్యధ్యానము పైన వివరింపబడిన సమాధి
నిష్ఠలో చేరిపోవును. గాన, ఈ బాహ్యబ్రహ్మనిష్ఠకు సంబంధించిన
ధ్యానవిధాన మిచట తెలియవలెను ఈ బాహ్యధ్యానక్రియ
సకలజగద్దృశ్యములును ధ్యేయమైన బ్రహ్మవిభూతి విలాసములే
యనెడి విశ్వాసముమీద ఏర్పడునేకాని, అన్యథా కానేరదు,
కనుక 'యత్ర యత్ర మనోయాతి తత్ర తత్ర సమాధయః'
యనునట్లు మనసుకు గోచరించెడి ప్రతిదృశ్యమును ధ్యేయ
మైన బ్రహ్మమూర్తియే యనెడి యధ్యవసాయ మేర్పడుటచే
ప్రస్తుతమైన ధ్యానక్రియాసరణి - ఆచంటేశ్వర, సురాభాండే
శ్వరా ద్యుపాఖ్యానములు ఇట్టి ధ్యానసరణిలో ప్రమాణము
లగుచున్నవి.

ధ్యేయమైన పరమాత్మను హృదయకమలమందు నెల
కొల్పి ధ్యానించెడి ధ్యానక్రియగూడ ఈ ప్రకృతమైన బాహ్య
బ్రహ్మనిష్ఠనుబట్టి మారును ఎట్లన - హృదయమన గుప్పెడు
గొలుగల హృదయపుండరీకముగాక, సర్వవ్యాపకమైన చిదా
కాశమే యగును. దహరాకాశమనునది వ్యాపకమైన చిదా
కాశమేసుమా యని ఛాందోగ్య దహరవాక్యము చెప్పుచున్నది.
"యావాన్వా అయమాకాశః తావానేషో అంతర్హృదయ

ఆకాశః తస్మిన్ ధ్యాత్వా పృథివీ సమాహితే" యని ఈ శ్రుతి విస్పష్టముగనే హృదయాకాశము అఖండ చిదాకాశమే యని వక్కాణించుచున్నది. కనుక హృత్కమల దేవతాధ్యానమన అఖండచిదాకాశరూపుడగు పరబ్రహ్మధ్యానమనియే యేర్పడును.

ఎట్లన - చిదాకాశ వివర్తమే సకల జగత్తును అనెడి ప్రకృత జగద్బ్రహ్మప్రక్రియయందు సర్వ నామరూపజగమును తనతో సహా సన్మూలము, సదాయతనము, సత్ప్రతిష్ఠితము నగును గాన, నే యొక జగద్దృశ్యమైనను చిదాకాశభావము విడని వ్యక్తిభావము కలదే. గాన, నిట్టి వివేకముగల ధ్యానియొక్క ధ్యానము బహిర్లక్ష్యముగల బహిర్ముఖధ్యానమేయైనను బ్రహ్మ నిష్ఠయే యగునుగాని. దృశ్యనిష్ఠగా నేర్పడదు. ఇట్టిదే ఈ ప్రక్రియయందలి ధ్యానక్రియాసరణి.

(2) యజ్ఞాచరణము:— ఇది జగద్బ్రహ్మబోధ ననుసరించి, బ్రహ్మాహంభావముతో సాధకుడు నిర్వర్తింపవలెను అనగా తన రూపమున బ్రహ్మమే యాగకర్తగా నుండి ఆచరించు చున్నాడు సుమా యనెడి సద్భావ మనుట ఇంతియే గాదు — "అహం క్రతు రహం యజ్ఞః స్వధాఽహ మ హమౌషధం। మంత్రోఽహ మహమేవాజ్య మహ మగ్ని రహం హుతమ్" అని గీతావచనముగదా! యాగము, మంత్రము, అగ్ని, ఆజ్యము, హవిస్సు మొదలగు సంభారమంతయు తానే యని భగవానుడు చెప్పెను. మరియు 'భోక్తా చ ప్రభురేవ చ' యని గూడ దెలిపెను; అనగా యాగభోక్తయు యాగాధ్యక్షుడును గూడ తానే యని భావము. ఇంకను, 'బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః' - ఇత్యాదిగా, యజమానుడు, యాజకుడు,

స్రుక్స్రువాది పరికరములును. ఈ మొదలగు యజ్ఞకలాపము మొత్తము తానే యని భగవంతుడు వక్కాణించెగదా! ఇట్లే, సకల త్రిపుటియందును అబ్రహ్మబుద్ధిని మానవలయునని భావము. ఇది అఖండాత్మజ్ఞప్తితో యజ్ఞాచరణ మగును ఇచటి క్రియలన్నియు బ్రహ్మాత్మకములే, అనగా బ్రహ్మచైతన్య పరిస్పందములైనవే. ఇదే క్రియాద్వైతనిష్ఠ, అనగా క్రియల యందు బ్రహ్మచైతన్యాభివ్యక్తి యనుట. 'కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కిఞ్చిత్కరోతి సః' - అనిన శ్రీ గీతాచార్య భావమిదియే. ఇట్టి క్రియారంగమంతయు జ్ఞాననిష్ఠయే, జీవన్ముక్తతియే.

ఇట్లుగాక, యజ్ఞకలాపమున విభిన్నదృష్టిచే యజమాని, హోమాగ్ని, హవిస్సాది పరికరములు మొదలగు సంభారములను, మంత్రపాఠము, హవనము మొదలగు క్రియలును, తత్తన్నామరూపమాత్రములే యని భావించి యజ్ఞక్రియను జరుపుచో, నట్టిది కేవల క్రియాత్మకమై, మోక్షప్రదముగాక అభ్యుదయఫలమునే యొసంగెడి దగును. 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి' యని జగమెఱిగిన యభ్యుదయ మిదియే గదా! 'జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన' అనినట్లు, తత్త్వము నెఱింగించెడి విధమున కర్మ నాచరించుటే బ్రహ్మకర్మవిధానము. కర్మబ్రహ్మ సమన్వయ మనిన నిదియే యని శ్రీగురువులు సెలవిచ్చిరి. స్వధర్మములగు నిత్యనైమిత్తికాది కర్మల నన్నిటిని యిట్లు జగద్బ్రహ్మదృష్టి యనెడి స్వరూపనిష్ఠతో నిర్వర్తించుటే మోక్షాకి తగిన కర్మాచరణ మగును.

(3) దానక్రియ:— బీదలను, కుంటి, గ్రుడ్డి మొదలగు అంగవికలులను జూచి, పాపమని జాలిపడి, దానధర్మముల జేతుముగదా! లోకమున దయాదాక్షిణ్యపరులగు సామాన్య మానవు లందరును జేయు దానక్రియ యిట్టిదే. మరియు నిట్టి దానముచే మనకు పుణ్యఫలప్రాప్తి కలుగునని ఫలకాంక్షతో సైతము చేయుదుము. ఇంకను ఇచ్చువాని కాధిక్యమును, పుచ్చుకొనువానికి హీనత్వమును, దీనత్వమును భావించి యీ దానములు చేయబడుచున్నవి. ఇట్టి దానక్రియ ఫలహేతువై జన్మకారకమే యగునుగాని, తారకము కాజాలదు. ఇక నిది తారకము కావలెనంటే, ముందు చెప్పబడిన బ్రహ్మైక్య బుద్ధితో జరుగవలెను. ఎట్లనగా — దాతగాను, ప్రతిగ్రహీత గాను ఉభయాయితముగా వెలసియున్నవాడు ఏకపరాత్పర బ్రహ్మమే యనెడి సాధుభావముతో "ఈశ్వరః ప్రతిగృహ్ణాతి ఈశ్వరోవై దదాతిచ। ఈశ్వర స్తారకోభాభ్యాం ఈశ్వరాయ నమోనమః" యనిన చందమున నిర్వహించెడి దానక్రియగా నుండవలెను. మరియు కుంటి, గ్రుడ్డి మొదలగు వికలులు, ధన ధాన్యాది సంపద్విహీనులును — ఇట్టివారందరును హీనులు, దీనులు అనెడి దుర్బుద్ధిని విడచి, 'శునిచైవ శ్వపాకేచ' అనిన రీత్యా వీరందరును సాక్షాన్నారాయణస్వరూపులే యనెడి సన్నిరీక్షణముతో సత్కారపూర్వకముగ జరిగెడి దానక్రియ, కేవలము ఆత్మేశ్వరారాధనమేయై సంతారకమగును.

(4) సమాధి:- సమాధిక్రియగూడ మానసికమైన అంతః క్రియయేగాని, శారీరకమైన యాగ, దాన, హోమాదికము వంటిది గాదు కనుక సమాధికూడ నంతర్లక్షకమైనదే యని

సామాన్య వివేకమైయున్నది. ధ్యానక్రియకును, సమాధిక్రియకును భేదా మెట్టిదన, ధ్యానము కర్తృతంత్రమైన భావనయు, సమాధియన్ననో, వస్తుతంత్రమైన నిష్ఠయు యగుచున్నది. ఈ విభేద మీ రెంటికిని ఏర్పడియున్నను, లక్ష్యముమాత్రము ఈ రెంటికిని అంతర్లక్ష్యముగనే సామాన్యతత్త్వజ్ఞానమున చెప్పబడుచున్నది. కాని ప్రకృతమైన మన బాహ్య బ్రహ్మనిష్ఠా శాస్త్రార్థమున, సమాధినిష్ఠను, మనము ధ్యానక్రియను తెలిసినట్లే, విలక్షణముగ తెలియవలెను. ఈ వైలక్షణ్య మెట్టిదన, బ్రహ్మవివర్తమాత్రమేయైన, ఈ నామరూప ప్రపంచమున బాహ్యాభ్యంతరములు రెండును సమాధిశబ్దార్థములే యగును. గాన, బహిర్ముఖమైన బహుమనస్కత, సమాధినిష్ఠ కానేరదనియు, అంతర్ముఖమైన అమనస్కతమాత్రమే సమాధినిష్ఠ యగుననియు భావించుట, ఈ జగద్బ్రహ్మప్రక్రియకు వ్యతిరేకమగును. 'సదా సమాహితచిత్తా, సదా వ్యుత్థితచిత్తాశ్చ' అని చెప్పబడెడి, బాహ్యాభ్యంతరసమాధు లివియే. 'యోగరతోవా భోగరతోవా' యనెడి 'మోహముద్గర' సూక్తి ఈ భావమునే చెప్పును. బాహ్యసమాధి యన, బ్రహ్మముయొక్క సర్వాత్మభావ దృష్టితో సంసరించుటే యగును. సకల సంసారమును ఈ దృష్ట్యా సమాధియే యగును. 'కర్మణ్యకర్మయః పశ్యేత్' యనెడి గీతాసూక్తి యిదియే. విదేహజనకుని సకల రాజ్యతంత్రమును బాహ్యబ్రహ్మనిష్ఠ యనియే చెప్పబడినది గదా! సర్వపరిగ్రహమైనను, సర్వత్యాగమైననుగూడ, సమాన జ్ఞానస్థాయిని కలవియే యని చెప్పుచున్నారు "కృష్ణో భోగీ శుకస్త్యాగీ' యనెడి ద్వివిధజ్ఞాని సంసూచన మిదియే.

(౫) అమనస్కయోగము:— అమనస్కయోగ మనునది గూడ సమాధినిష్ఠయే. మనస్సు ఆత్మాకారమగుటే మనోరాహిత్యమనియు, నిదియే యమనస్కనిష్ఠ యనియును సామాన్యముగ తత్త్వశాస్త్రపరిశీలకులు చెప్పెడిమాట. కాని, మనసు విషయాకారమగుచో, అది బహిర్ముఖతయే అగునని నెడివారేకదా పీరు. ప్రకృతమైన మన జగద్బ్రహ్మబోధయందో, సర్వవిషయములును విషయియగు ఆత్మపరిణామములే, యనగ ఆత్మస్వాతంత్ర విజృంభిత స్వతంత్రవివర్తములే, యని గదా నిరూపింపబడినది. ఈ దృష్టినిబట్టి అనగా స్వరూపనిష్ఠయందు యెంతటి విషయాకారమే యగుగాక, చిత్తమునకు బ్రహ్మాకారమే సమకూరును గాని, జాడ్య (దృశ్య) లక్షణ మేర్పడదుగదా! గాన, దృశ్యమునందు, బ్రహ్మభావము కలుగుటయే అమనస్కము. కనుక, అమనస్కయోగమును గురించి ప్రత్యేకముగ మనము విచారింపనక్కరలేదు. బాహ్యాభ్యంతర సమాధినిష్ఠనే క్రమముగ బహుమనస్క - అమనస్క నిష్ఠయని తత్త్వవిదులు పేర్కొనుచున్నారు.

రాజయోగము:— ఈ ఆచరణముగూడ బహుమనస్కయోగమనెడి బాహ్యసమాధినిష్ఠయే బహుమానస శివరాజయోగి యని బాహ్యబ్రహ్మనిష్ఠుడు పేర్కొనబడుచున్నాడు. కనుక ద్వివిధసమాధి విచారముతోడనే, ఈ రాజయోగ విచారముగూడ గతార్థమగును. దీనినిగురించి ప్రత్యేక పర్యాలోచన మనవసరము.

## (2) వృత్తానుశీలనము:— సత్యాహింసాది సదాచార సమాలోచనము.

(1) సత్యవ్రతము:— బ్రహ్మప్రపంచదృష్టిలో సత్యము, భూతదయ మొదలగు సదాచారసరణి ఎట్లుండునో ఇకమీదట మనము గమనింపదగిన విషయమై యున్నది. ద్వైతదృష్టినిబట్టి ఈ సత్య, దయాది వ్రతములన్నియు మనకందరకును ఒకవిధముగ తెలిసియేయున్నది. అనగా, ద్వైతసృష్టిలో 'వున్నది వున్నట్లు' మనము తెలియుటయు, తెలిసినచొప్పున భాషించుటయును, సత్యమని యెన్నబడుచున్నదిగదా! ఇట్లే అహింస యనునది, హింస్యమైన నే ప్రాణికిని హాని యొనర్పకుండుటే యని, గణింపబడుచున్నది. వైరాగ్యశీలమున, ఇట్లే ద్వైతసృష్టియందలి దారాగారాది విషయములను త్యజించి, అనాసక్తిపరుడగుటే యని తలంపబడుచున్నది ఇట్టి భావములన్నియు, జగత్తు బ్రహ్మేతర మనెడి సృష్టిదృష్టి ననుసరించెడివే. కనుక నివియన్నియు, సంకుచితభావములే యగుగాని, పూర్ణభావములు గానేరవు. యావద్విశ్వము విష్ణువే యనెడి బ్రహ్మజగద్బోధ ననుసరించి నిఖిలప్రపంచదృశ్యములను 'సన్మూలా స్సదాయతనా స్సత్ప్రతిష్ఠితా' యనెడి శ్రుతినిబట్టి, సద్వస్తువుయొక్క విలాసములేగాన, తాత్త్వికములే యగును. ఇట్టి సద్దృష్టి నవలంబించిన సాధకునకు, సత్యాసత్య విభాగము అవిద్యకుని దృష్టిలోనిదివలె నుండక, విలక్షణముగ నుండును. అవిద్యకునకు 'లేనట్లు' తోచెడి భావములు విద్యావంతునకు 'ఉన్న'వనియే గోచరించును. ఇట్లే అవిద్యకునకు 'సత్యములు'గ కనబడెడి భావములు జ్ఞానికి 'లేనివి'గనే తెలియవచ్చును అవిద్యకదృష్టినే పెట్టుకొని

వున్నదానిని ఉన్నదిగను, లేనిదానిని లేనట్లుగను భావించు టయు, [illegible] యనెడి నిశ్చయము [illegible] యాథార్థ్యమే లేదు గాన, అవిద్యాదృష్టియందు కొంత సత్యమును, మరికొంత యసత్యమును కలదని భావించవలసివచ్చును. కాన, అవిద్యాదృష్టియందలి సత్యభావముగాని, సత్యాభావముగాని యసంబద్ధప్రలాపమే యగును. ఇక విద్యాదృష్టి ననుసరించెడి సత్యభావమన్ననో, భావాభావ రూపముగ వెలసియున్నది బ్రహ్మమే గాన, అట్టి బ్రహ్మాత్మకదృష్టితో వ్యవహరించు సర్వము సత్యవ్రతాచరణముగనే బరిగణింపబడును. మరియు సామాన్యశాస్త్రదృష్టి ననుసరించెడి ధర్మాధర్మములు, సత్యాసత్యములును పరమార్థసత్యమైన స్వాత్మలీలలే యగును దృష్టాంతముఖమున నీయంశ మీదిగువ విశదీకరింపబడుచున్నది.

అవిద్యావంతునకు అగస్త్యుడును, శ్రీకృష్ణుడును నిత్య భోక్తయు, నిత్యగృహస్థుగను కనపడుచుండ, బ్రహ్మతత్త్వజ్ఞానికి ఈ వ్యక్తులే, నిత్యోపవాసిగ నొకరును, నిత్యబ్రహ్మచారి నొకరును గోచరించెదరని తత్త్వశాస్త్రజ్ఞుల పరిపాటియైయున్న గదా! భోక్తృ భోగ్యము లనునవి, విభిన్నపదార్థము లనెడు దృష్టిలో అగస్త్యుడును, శ్రీకృష్ణుడును విషయభోక్త లనుట నిజమేయైనను, భోక్తృ భోగ్య సామరస్యము నెరింగిన జ్ఞాని దృష్టిలో, వీరియిరువురును ఆత్మరత్యాత్మక్రీడాపరులే యగుదురని తత్త్వవిదుల సమన్వయమై యున్నది. ఇట్లే తదితరసందర్భము లందును సత్యాసత్య విభాగమును విద్యావిద్యా దృష్టులనుబట్టి విశిష్టరీతిన గమనించుచుండవలెను.

(2) అహింసా వ్రతము:— జగత్తులో 'అహింసా పరమో ధర్మః' అను విశేషమైన సూక్తిగలదు. అహింసయే, అనగా ఏ జీవిని చంపకుండుటయే పరమధర్మమని తాత్పర్యము. ఇది ధర్మాఽధర్మ శాస్త్రసృష్టి. బ్రహ్మదర్శనమునుబట్టి హింసాఽహింసల లెక్కము మారును. ఎట్లన — భగవంతుడు సృష్టించిన జీవరాసులలో సహజముగనే ఒకజీవి మరియొకజీవికి ఆహారముగా నిర్మాణమైయుండెను. ఈ లక్షణము జలచరములందును, భూచరములందును బహుళముగా జూడనగును. పిల్లికి ఎలుకయే ఆహారము; కుక్క పిల్లిని చంపివేయును; సింహము ఏనుగు మాంసమున కెదురుచూచును; జలచరములలో పెద్దచేప చిన్న చేపను తినును; సొరచేప పెద్దచేపను, తిమింగిళము సొరచేపను, ఈ విధముగా ఒకదాని కొకటి ఆహారముగ నున్నది. మరియు మానవులందే అధమజాతులు మాంసాహారులై యున్నారు గదా! అట్లుగాకపోయినను యజ్ఞమున పశువును వ్రేల్చుదురు గదా! ఇట్టిదంతయు హింసాకాండగాక ఎట్టిదగును? జగమున హింసజేయకుండుటకు తా వెక్కడ? ఆహారమునకై శాకములను కోసి వండుచుంటిమి, అదిమాత్రము హింస గాకపోవునా? అంతయు హింసయే యగుచున్నది. హింసజేయక ప్రపంచమున సంసరించుట యనివార్యముగా దోచుచున్నది. ఇందువలన నాత్మవిదుడు గానివానికి 'అహింస పరమధర్మ'మను సూక్తిని నిర్వహింప తరముగాదు. "సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్ । నహి నస్త్యాత్మ నాత్మానం తతో యాతి పరాం గతిమ్॥" అని గీతావచనానుసారము సర్వజగత్తును ఈశావాశ్యమే, కనుక యనశ్వరమే. అనగా, హింసింపదగనిదియే

సుమా ! యనెడి తత్త్వనిశ్చయమును కలిగి, రాగద్వేషములను హింసాఽహింసలందు అన్వయించక, అనగా హేయోపాదేయ రహిత ఆత్మ, హింసింపదగనిది యనెడి నిశ్చయముతో, యాదృచ్ఛిక హింసాఽహింసాపరుడై యుండుచే, అనగా తాను తన దృశ్యమును స్వరూపాతిరిక్తములుగాక, ఏకరూపులే యను నిశ్చయము కలిగి, అట్టి భావనాసిద్ధిచే వ్యవహారక్రమము నందను వర్తించుటయే కర్తవ్యము. అట్టిచో కర్మలకు కర్తృభావము పోయి, స్వరూపస్థాయియే యేర్పడును. మరియు నచటి హింసయు హింసగానిదగును. ద్వైతదృష్టిగతమైనదంతయు క్రియాత్మకము, కనుకనే హింసగా నెన్నబడుట సంభవించును. ఏకవస్తుదృష్టికృతమంతయు స్వరూపవృత్తమే యగును. కనుక, పై చెప్పిన శ్రుత్యానుసారము, అహింసయే యగుటయును ఏర్పడును. అహింస పరమధర్మమను సూక్తి నిట్టి అద్వయవస్తు వ్యవహారమునందే సరియగుచున్నదగుటచే, నట్టి సూక్తి ఈ స్వరూపనిష్ఠయందే సార్థకమగునని తెలియవలెను.

(8) వైరాగ్యశీలము:— వైరాగ్యానువర్తనము బ్రహ్మదృష్ట్యా జూచిన విచిత్రముగా నుండును. ఇచట దోషదృష్టిని చేయు విరక్తి విరుద్ధమగును. ఎట్లన – ప్రపంచమున ముక్తిపొందవలెనన్న, వైరాగ్య మత్యంతావశ్యకమని చెప్పియుండిరిగదా! వైరాగ్యమన్న ఏవస్తువును కోరకుండుట, ఏవస్తువునందును ప్రియత్వము, సక్తి లేకుండుట, విషయములను కాకవిష్ఠ, వాంతాశనములవలె హేయముగా నిషేధించుటయు నని ఈ మొదలగు భావములను జెప్పియుండిరి. ఇది లోకదృష్ట్యా దృశ్యములందు దోషదృష్టి విరక్తి. పురాణ, ప్రసూతి, శ్మశాన

వైరాగ్యాది ఆభాసలుగూడ కలవు. కాని నిజమైన విరక్తిగూడ కలదుగదా! అపక్వచిత్తుల కిట్టి విరక్తియే శాస్త్రముచే బోధింప బడుచున్నది. పక్వచిత్తులకన్ననో, జనకరాజర్షి యొక్క వైరాగ్య శైలి చెప్పబడినది.

"సత్యం జగదితి భానం సంసృతయేస్యా దపక్వచిత్తానామ్
తస్మా న్మృషాత్వ మేతస్య ప్రతిపాదయంతి నిగమాన్తాః॥"
"పరిపక్వమానసానాంతు పురుషవరాణాం పురాతనై
సుకృతై ర్బ్రహ్మైవేదం సర్వం జగదితి భూయః
ప్రచోదయత్యేషః॥"

అని శ్రీశంకరులే యీ తేడాను చూపిరి. కనుక నపక్వ చిత్తులకు దోషదృష్టియే విరక్తియు, పక్వచిత్తులకు మిథ్యా దృష్టి వైరాగ్యమనియును వ్యవస్థ. మిథ్యాదృష్టియన, దృశ్య మందు వస్తుబుద్ధిని విడచి సద్బుద్ధిని చేయుట. ఇట్టి దోషదృష్టి విరక్తి (అనగా దృశ్యము సత్యమనియు హేయమనియు భావిం చుట) నిజమైన వైరాగ్యముగా పరిగణింపబడక పోవుటెందుల కనిన – నామరూపసత్యత్వబుద్ధి ఈసాధకునకు విడువదు "అంతా రామమయం జగమంతా రామమయం" అనెడి సర్వాత్మ భగవద్బుద్ధి నామరూపములందు కలుగదు. ఇతనికి విషయము లన్నియు నిజమునకు అధిష్ఠానవిలాసమాత్రములై యున్నందున అనగా స్వరూపాతిరిక్తములుగాక, స్వరూపవిలాసములే యై నందున తనకు ఈవివరము తెలియకున్నను 'ఆత్మన సుకామాయ సర్వం ప్రియం భవతి' యనినరీత్యా తనమీద తనకు ద్వేషము కలుగదు గావున ఇట్టి అజ్ఞుడగువాడు విషయముల నెంత త్రోసి

పుచ్చినను "ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి" యన్నట్లు విరాగము నిలువక తిరిగి వానినే కోరుట సంభవించుచున్నది. విషయ ప్రియత్వము వదలుట లేదు. విషయము స్వాత్మగనుకనే ఈ ప్రియత్వము విడువకపోవుట. కనుక ఆత్మభావము లేక వైరాగ్యము నిలచుట లేదు. అట్టియెడల వైరాగ్య మెట్లొనగూడు ననగా వినుడు - నామరూపాదులచే విషయములుగానున్నను అవి నిజమునకు బ్రహ్మమాత్రములే యగుచున్నవి. "జగద్బ్రహ్మ" యను నిశ్చయము తెలిసినందున దృశ్యమంతయు బ్రహ్మమే యగుచున్నది. గనుక దృశ్యమును విషయముగా జూచి హేయపడ నవసరము లేక, బ్రహ్మమాత్రములని వానిని యథాప్రాప్తములనుగా తెలిసి అనుభవింప వచ్చును. ఆ ప్రాప్తములను కోర వలసిన పనియుండదు. విషయమునందు విషయబుద్ధిచేయక బ్రహ్మదృష్టి చేయుటయే వైరాగ్యము. విషయదృష్టిత్యాగము మాత్రమే చాలదు. అట్టిది జడనిష్ఠ యగును. కనుక విషయమందు బ్రహ్మదృష్టినిగూడ జేయుటయే ముఖ్యమైనదిగా తెలియవలెను. "యత్ర యత్ర మనోయాతి తత్ర తత్ర సమాధయః" అను ప్రమాణవచన మీయర్థముతో సరియగును మనస్సు ఎచ్చటెచ్చట పోయిద్రాలునో అచ్చట ఆత్మయే కః దని నిశ్చయించుకొన వలెను. బ్రహ్మనిశ్చయముతో విషయ పరిగ్రహముగాని, విషయత్యాగముగాని సమానరస మేయగును శైలిభేదము మాత్రమే. సర్వపరిగ్రహ సర్వత్యాగముల (అనగా బ్రహ్మభావమున నిర్వికల్పస్థితి యందుండుటయు లేక, బ్రహ్మభూతుడై జగద్వ్యవహారము సలుపుటయు) ఏకరసమే యని వాశిష్ఠమున లీల తన భర్తకు చెప్పినది. ఇవే సనకాది

మార్గము, జనకాదిమార్గము అని చెప్పబడుచున్నవి "కృష్ణో భోగీ, శుక స్త్యాగీ రాజానౌ జనకరాఘవౌ వశిష్ఠః కర్మ కర్తా చ, పంచై తే జ్ఞానిన స్స్మృతాః" అని చెప్పబడిన భావ మిదే. 'యోగరతో వా భోగరతో వా' అనెడి భావమును ఇదే. గనుక, బ్రహ్మనిష్ఠతో (స్వరూపస్థితుడై) జనకరాజర్షివలె వ్యవహారము సలుపుటయే పూర్ణవైరాగ్యము అని తెలియవలెను. అదియే, ఆత్మప్రేమ. సతిపతుల ధర్మములందును ఇట్టి ఏకవస్తునిష్ఠనే చేయతగినది. అట్టియెడ స్త్రీ పురుష సంసారముకూడ బ్రహ్మ నిష్ఠయే యగుచున్నది. అట్టిదానిని ఆత్మరతి, ఆత్మక్రీడయనియు, అదభ్రప్రేమ యనియు నిర్వచనము జేసిరి. ఇట్టిదే యథార్థ వైరాగ్యమని నిర్ధారణజేసిరి.

(4) సమతాశీలము:— 'యథా భూత పృథగ్భావం, ఏకస్థ మనుపశ్యతి । తతఏవచ విస్తారం, బ్రహ్మసంపద్యతే తదా' అనియు, 'జ్ఞాన యజ్ఞేన చాప్యన్యే యజన్తోమా ముపాసతే । ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతో ముఖమ్' అనియు, 'సర్వభూతేషు యేనైకం భావమవ్యయ మీక్షతే । అవిభక్తం విభక్తేషు తద్ జ్ఞానం విద్ధి సాత్వికమ్' అనియు నీ మొదలగు గీతావాక్య ములచేతను, ఇంకను శ్రీమద్భాగవతాది గ్రంథప్రమాణముల చేతను, పరమేశ్వరుడే సకలప్రపంచరూపముగా వెలసియుండెనని తెలియబడుచున్నందున, రాగద్వేషము లనెడి కామవికార ముతో, దేవ తిర్యఙ్నరాది విభేదమును పాటింపక, మన్వాదుల వర్ణాశ్రమధర్మాదుల విడి, విధిప్రతిషేధ శాస్త్రమును కాదనక, ఔననక, యథాప్రాప్తముగ ననువర్తించుచుండుటే, నిర్దుష్ట మైన సమత కాగలదు. లోకము సమశబ్దార్థమును ఈతత్త్వ

దృష్ట్యా గ్రహించుటలేదు. సర్వమానవులను విద్య, ఐశ్వర్యము, మతము, అధికారముల నెడి ప్రాపంచిక హెచ్చుతగ్గు భావములనుబట్టి, తారతమ్యముతో పరిగణించుట కూడదని, మానవత్వేన సర్వులను సమభావముతోడనే గణింపవలెనని, నేటి సామ్యవాదుల ఆశయము. వీరిది పరమేశ్వరుని గమనింపని నాస్తిక దృష్టిగాని, లేదా తటస్థేశ్వరభావమైన ఏకదేశాస్తికముగాని యగునేగాని, పరమేశ్వరుని సార్వాత్మ్యము నెఱింగెడి పూర్ణాస్తికత గా నేరదు. 'విద్యా వినయసంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని శునిచైవ శ్వపాకేచ, పండితాః సమదర్శినః' అని చెప్పబడిన సమతాభావము, పూర్ణబ్రహ్మాత్మక ప్రపంచదృష్టిలోనిది — అనగా సుర నర తిర్యగాది సర్వజగత్తునూ, ఏకమైన బ్రహ్మ బహుభవనమే యనెడి సుదృష్టిలోనిది యనుట.

మరియు "సమదుఃఖ సుఖం ధీరం" అని చెప్పబడినది గదా! సుఖదుఃఖాదులందును సమత్వమన సంతోష విచారముల సహించిన మాత్రమున సమదుఃఖ సఖుడనుకొనుట చాలదు. దృశ్యమునందు సత్యత్వబుద్ధితో తాత్కాలిక నిగ్రహము చేయగలుగువానికి అంతర్దృష్టి చలించుచునే యుండును. ఈ అంతర్దృష్టినిశ్చలత స్వరూపానుభవముచేతనే గలుగునదిగాని వేరువిధమున గాదు. సర్వాత్మభావమైన స్వరూపస్థితియందుండి సుఖదుఃఖానుభవముల పొందిననూ సమదుఃఖసఖుడే యగును. అట్లుగానిచో రామచంద్రుని భార్యావియోగ దుఃఖము దుఃఖమనియే చెప్పవలసి వచ్చును. రాముడుకూడ మానవమాత్రుడే యనవలసి వచ్చును. కాన ఉత్తమపురుషుల సుఖదుఃఖ ప్రవృత్తియంతయు స్వరూపనిష్ఠా సంబంధమే. ఈనిష్ఠ, బాహ్యనిష్ఠ

యనుటకు సుఖదుఃఖముల కెడి ద్వంద్వప్రవృత్తినిబట్టి స్పష్టమగు చున్నది గదా! కనుక సమతాభావమనిన అద్వైత బ్రహ్మశీలమే యనుట తేలినది.

## II. అధికారి విచారము.

ఇంతదనుక జగద్బ్రహ్మప్రక్రియను అట్టిదాని ననుసరించు సాధనక్రమమును వివేచించితిమి. ఇక ఈ సాధనానుష్ఠానమునకు సర్వులును అధికారులేనా? యనెడి సారాంశమును గ్రహింపవలసి యున్నది. ఈ సందర్భమున సిద్ధపురుషులయొక్క భావమేమన, జగద్బ్రహ్మదృష్టి ఉత్తమాధికారికేగాని యేర్పడదనియు అట్టివాడే ఈ చెప్పబడిన సత్సాధనముల నిర్వహింపగలడనియు అనునదే. కాని ఒక్కసారిగా మానవుడు ఉత్తమాధికారి కానేరడు గదా. ఇందువలన ఉత్తమాధికారి యోగ్యతలను అధమాధికారి యగువా డవలంబించి యభ్యాసమొనరించుచో క్రమక్రమశః నీసంస్కృతి యతని చిత్తమున బలపడి యతనికి నిర్దుష్టమైన యుత్తమపరిపాక మేర్పడగలదు. కనుక ప్రాథమికాభ్యాసకుడు సైత మీచెప్పబడిన యుత్తమాధికారి యాదర్శములనే యవలంబించి సాధనమునకు కడంగవలయుననుటయే తత్త్వవిదుల పరమాశయమై యున్నది. ప్రారంభకుడు యెద్దియో యొకసాధనమును పరమపురుషార్థమునకై యవలంబింప వలసినదే కదా! ఈ సాధనము జగద్బ్రహ్మప్రక్రియ ననుసరింపనిదై ఇతరవిధమైనదగుచో అనగా సృష్టి భగవదాత్మకము కాదనియు, జడప్రకృతియే ఉపాదానమనియు భావించెడి సరణిలో గావింపబడెడి అభ్యాస మయినయడల

కలకాలము అభ్యసించినను ఈ దృష్టి పూర్ణబ్రహ్మదృష్టి కానే రదు. కాన ఈ సాధకునకు పూర్ణబ్రహ్మాధిగమము సంభవింప నేరదు. కనుక ఇట్టి భావప్రమాదము నెఱింగియే పూర్ణబ్రహ్మ నిష్ఠులగు మహాపురుషులు సిద్ధునియొక్క ఆదర్శములనే సాధకు నకు సాధనములనుగా వ్యవస్థచేసిరి. కనుక పరమార్థసాధకుడు ఆరంభమునుండియే భగవంతునియొక్క సర్వాత్మభావమనెడి అద్వైతాత్మనిశ్చయము తోడనే యజ్ఞ, ధ్యాన, దానాది సర్వ క్రియాకలాపమును, సత్యాహింసాది సదాచారపద్ధతిని అభ్య సించుటయే నిర్దిష్టమైన శ్రేయోమార్గ మగునుగాని వేరొకటి గానేరదు.

నీవు, నేను, నాది, నీది యనెడి ద్వైతబుద్ధినే పెట్టుకొని, సంసారమును యథేష్టముగ ననుభవింపవచ్చుననెడి దుర్బుద్ధిగల వారలకీ యద్వైత భగవద్విశ్వాస వివేకములు సమ్మతములు గావని, మన రాగద్వేష ప్రవృత్తిశీలమే చాటుచున్నది గదా ! ఇట్టి రాగద్వేషప్రకృతిని మనము తిరస్కరింపగలిగిననేగాని, పై జెప్పబడిన పూర్ణబ్రహ్మ విశ్వాస వివేకములు మనకు కలుగ జాలవు. అపుడుగాని యీ చెప్పబడిన సత్యాది సాధనాక్రమము లను మన మవలంబింపజాలము. కనుక రాగద్వేషాది హేతువైన ద్వైతబుద్ధిని విడచి, సర్వము బ్రహ్మవిలాసమే యనెడి జగ ద్బ్రహ్మబుద్ధిని పరమార్థసాధకు లందరును సంపాదింపవలయును.

## 8. ప్రయోజన విచారము.

ఈ దృష్టిసృష్టిబోధ యనెడి జగద్బ్రహ్మబోధయొక్క ప్రయోజనము ఉత్తమాధమాధికారుల కిరువురకును వారివారి

పరివాకానుసారము చెందగలదని సద్గురువుల సమన్వయమై యున్నది. ఎట్లన — ఉత్తమాధికారికి, ఈ జగత్తు బ్రహ్మమున కంటెను వేరైన పదార్థమేగాదు. బ్రహ్మముయొక్క స్థితిగతులే జగత్తునకును స్థితిగతులై యున్నవి. కనుక 'ఆద్యత్రయం బ్రహ్మ రూపం జగద్రూపం తతోద్వయమ్ సన్మూలా స్సోమ్యేమాః ప్రజా స్సదాయతనా స్సత్ప్రతిష్ఠితాః' — ఇత్యాది వచనము రీత్యా, సర్వత్రా బ్రహ్మనిశ్చయముతో వ్యుత్థానకాలమున సాధకులును, సిద్ధులునుగూడ యథాప్రాప్తముగ జగత్తు ననుభ వింపవచ్చును అనెడి సమాశ్వాసమునకై వేదాంత మీ జగ ద్బ్రహ్మబోధను సమర్పించినది.

ఇక అధమాధికారి ప్రయోజన మెట్లన — ఈ యధికారి కృపణుడు, అనగా 'కృపణాః ఫలహేతవః' అని చెప్పబడిన బుభుక్షువు. ఈతనికి సంసారభోగములను యథాతథముగా ననుభవింప వాంఛయుండదు. కాని, 'బ్రహ్మవిదాప్నోతి పరమ్' అనెడి వేదాంతసూక్తిని విని, తాను బ్రహ్మవేత్తగూడ కావలె ననెడి మనోరథముండును. ఇట్టివానికి, బ్రహ్మమే కామినీ కాంచనాది భోగ్యపదార్థములుగా నుండిన బాగుండునుగదా యని తోచును. ఈ కృపణబుద్ధిగలవాడు బ్రహ్మపరిణామము నపేక్షించుచుండును. విరక్తుడగువాడు మాత్రమే బ్రహ్మవివర్తము నపేక్షించును. ఇట్టి కృపణుడైన అధమాధికారికి వేదాంతము బ్రహ్మమునే సకలప్రపంచరూపమైనదానినిగ, పరిణామ ప్రక్రియతో కనబరచును. ఎట్లన — సముద్రము ఫేనవీచీతరంగ

బుద్ధ్యాదికముగ నెట్లు పరిణమించునో, యట్లే బ్రహ్మము భోక్తృ భోగ్యాది సకలజగద్రూపముగ పరిణమించునని బోధించును. బ్రహ్మవాంఛ గలవానికి సముద్రదృష్టాంతము బ్రహ్మకంటెను వేరగు ప్రపంచము లేనేలేదుసుమా యనెడి వివేకమును తెలుపునుగాని, బ్రహ్మ ప్రపంచముల రెండింటిని ఒప్పుకొని, ఈ రెండింటికిని అనన్యత్వమును చెప్పుట కేర్పడినది కాదు. కృపణునిపట్లనో, బ్రహ్మ ప్రపంచముల రెంటిని ఒప్పుకొని, యీ రెంటికిని అనన్యత్వమును బోధించును

అట్లు కాగా ప్రకృత మేమన — కృపణుడు బ్రహ్మ పరిణామములైన భోక్తృభోగ్యములను, శాస్త్రోక్తకర్మోపాసనములచేసి, బ్రహ్మనుగ్రహమున సంపాదించి, యనుభవించును. అనుష్ఠానకాలమునగాని, అనుభవకాలమునగాని బ్రహ్మమును భోక్తయగు తననుండిగాని, తన భోగ్యమునుండిగాని విడగొట్టుకొననివాడుగ నుండును. "న తద్వ్యావృత్తి రతద్వ్యావృత్తిః" అని శ్రీమన్మధుసూదన సరస్వతులీభావమునే "అతద్వ్యావృత్త్యాయం చకిత మభిధత్తే శ్రుతిరపి" అనెడి మహిమ్నస్తుతి వచనమునకు వ్యాఖ్యానావసరమున అతద్వ్యావృత్తిపదార్థమును పరిణామవివర్తోభయ భావపరముగా కృపచేసిరి. ఇక నీ ప్రయోజనవిచారముతో గ్రంథమును ముగింతును.

## ఉపసంహారము.

ఇట్లు సృష్టి దృష్టి విధముగా జీవన్ముక్తియనెడి పరమ పురుషార్థము కలుగనేరదు గాన, దృష్టి సృష్టి విధానమైన

సర్వాత్మక బ్రహ్మాద్వైత శ్రద్ధావివేకములనే సర్వసాధకులును సంపాదింపవలసినది. ఇట్లైననేగాని, ప్రాణిమాత్రమున కంత కును సహజమైయుండెడి, సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాది వాంఛలు నెరవేరవు. ఇట్టి సర్వాత్మక పూర్ణబ్రహ్మనిష్ఠచేతనే, సర్వాత్మత్వ మహావిభూతి సహితమైన స్వతస్సిద్ధ ఈశ్వరత్వము సాధకున కావిర్భవించునని చెప్పబడినది.

ఇదియే శ్రీ గురుదేవులు ప్రబోధించిన

అద్వైత తత్త్వార్థ సారమైన

"శ్రీ శంకర హృదయము"

సమాప్తము.

